29.12.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:52 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



### ఆమె ఆసక్తితో చాలా మందిలో కొత్త ఆశలు!

# సోనియా ఆంతర్యం ఏమై వుంటుంది?

సోనియా గాంధీ రెండు రోజుల రాష్ట్ర పర్యటన ఇక్కడి కాంగ్రెస్ వర్గాల్లో సంచలనం రేపింది. రాజీవ్ గాంధీ ఫౌండేషన్ స్మారక ఉపన్యాసం సందర్భంగా జరిగిన కార్యక్రమంలో పాల్గొనేందుకు హైదరాబాదుకు వచ్చిన సోనియా గాంధీ రెండు రోజులు కూడా బిజీ బిజీగా గడిపారు. గతంలో ఎన్నో మార్లు సోనియా గాంధీ హైదరాబాదుకు వచ్చారు, వెళ్లారు. కానీ ఈ తడవ సోనియా గాంధీ పర్యటన గతం కంటె భిన్నంగా వుంది. రాజకీయా లంటేనే ఆమడ దూరం వుంటూ అంటీ అంటనట్టు వ్యవహరించే సోనియా గాంధీ ఈమారు ఉద్దేశ పూర్వకంగానే రాజకీయ వాదులను కలిసి రాజకీయాల గురించి మాట్లాడారు. సోనియా గాంధీ హైదరాబాదు పర్యటన ఖరారు కాగానే




సోనియా ఇంటి దగ్గర నుంచి ఇక్కడి పి.సి.సి.కి ఆమె పర్యటన వర్తమానం పంపుతూ హైదరాబాదులో సోనియా గాంధీని కల వాలనుకునే వారి పేర్లు పంపితే ఇంటర్వ్యూలు మంజూరు చేస్తామని పేర్కొన్నారు. ఊహించని సందేశంతో పి.సి.సి. నేతలు నాలుక కరుచు కోవాల్సి వచ్చింది. సోనియా గాంధీకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి పెద్ద సంఖ్యలో ఇంటర్వ్యూలు ఏర్పాటు చేయిస్తే ప్రధాని పి.వి. నరసింహారావుకు ఎక్కడ కోపం వస్తుందోనని భయపడి పి.సి.సి. నేతలు ఈ విషయంలో తాత్సారం చేశారు. సోనియా గాంధీతో ఇంటర్వ్యూలు కోరే వారి జాబితా ఢిల్లీకి పంపకుండా తొక్కి పెట్టారు. అయితే సోనియా గాంధీ హైదరాబాదుకు వచ్చిన దగ్గర నుంచీ ఆమెను కలవాలని ఉబలాట పడిన రాజకీయ వాదుల సంఖ్య వందలకు చేరటంతో గత్యంతరం లేక పిసిసి ఇంటర్వ్యూలు కోరే వారి జాబితాలను సోనియాకు అంద జేసింది. ఆమెను ప్రత్యేకంగా కలిసి చర్చించిన వారిలో మాజీ ముఖ్య మంత్రులు శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి, నేదురుమల్లి జనార్ధన రెడ్డి వున్నారు. కాగా పిసిసి అధ్యక్షుడు కె. రోశయ్య కూడా సోనియాను ప్రత్యేకంగా కలుసు కున్నారు. అలాగే కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకుడు పి. జనార్ధన రెడ్డితో పాటు పలువురు కాంగ్రెస్ ఎమ్మెల్యేలతో సోనియా గాంధీ సమావేశ మయ్యారు.

### పివి పై ఫిర్యాదులకు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వడం కాకతాళీయమా? కావాలని చేశారా? ఏ ఆలోచనా లేకుంటే ఎందుకంత ఉత్సాహంగా కాంగ్రెస్ వాదులను కలిసి మాట్లాడారామె?

పిసిసి కార్యవర్గ సభ్యుల్ని కూడా ఆమె కలుసు కున్నారు. కాగా కాంగ్రెస్ తివారీ వర్గీయులకు కూడా ఆమె వర్తమానం పంపుతూ హైదరాబాదులో తనను కలవాల్సిందిగా కోరారట. తివారీ వర్గం రాష్ట్ర నాయకుడు కె. సాంబశివ రావు (కె.ఎస్. రావు) తన వర్గీయులతో వచ్చి సోనియా గాంధీకి స్వాగతం పలికారు. ఆ తర్వాత తివారీ వర్గం తరఫున కె.ఎస్. రావు ప్రభృతులు సోనియాను కలిశారు. మహిళా కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తల్ని కూడా సోనియా కలిసి ముచ్చటించారు.

సోనియా ఆంతర్యం పై మల్లగుల్లాలు

సోనియా గాంధీ ఉద్దేశ పూర్వకంగా కాంగ్రెస్ నాయకుల్ని కలవటంలోని ఆంతర్యం పై రాష్ట్ర కాంగ్రెస్‌లో చర్చ జరుగు తోంది. రాజీవ్ ఫౌండేషన్ ఛైర్ పర్సన్‌గా హైదరాబాదుకు వచ్చిన సోనియా రాజీవ్ స్మారక ఉపన్యాస సభలో పాల్గొన్న రాజకీయ నాయకుల్ని కలిసి, వారిచ్చిన

కొరవ 10 పేజీలో

### మాగుంట హత్యలో ముడివిడని చిక్కు

# ఆ గదిలోనే లేని గన్‌మ్యాన్ పై నింద మోపడం అన్యాయం?

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి హత్యకు సంబంధించి జనంలో ఇప్పటికీ ఒక స్పష్టమైన అభిప్రాయం ఏర్పడలేదు. పలు రకాల కథనాలు విన్పిస్తూనే వున్నాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా చెప్తున్నారు; ఒక్కొక్కరు ఒక్కొక కథనం విన్పిస్తున్నారు. పోలీసు ఈ త్వరలో ఛార్జి షీటు దాఖలు చేయ బోతున్నట్లు వార్తలు వస్తున్నాయి. అందులో వారు కేసు పై తమ సమగ్ర దర్యాప్తు వివరాలను వెల్లడి చేస్తారు. అప్పటి వరకు ఇటువంటి చర్చలు, రచ్చలు తప్పవు.

హత్య సమయంలో ప్రక్కనే వుండి, సుబ్బరామ రెడ్డి గారి తోటి తామూ తుపాకి కాల్పులకు గురైన మాజీ ఎమ్మెల్యే శ్రీ చెన్నారెడ్డి పెంచలు రెడ్డి బాగా కోలుకున్నారు. ఆయనింకా మద్రాసు అపోలో ఆస్పత్రిలోనే వున్నప్పటికీ ఆరోగ్య రీత్యా ఆందోళన చెంద వలసిన అవసరం ఏదీ లేదు.

ఈ హత్య విషయంలో చెన్నారెడ్డి పెంచలు రెడ్డి చాలా కీలకమైన సాక్షి. ఆ రోజు ఆ గదిలో ఆ దుర్ఘటనను చాలా మంది చూసి నప్పటికీ, పెంచలు రెడ్డి వలె సాహసించి సాక్ష్యం చెప్పడానికి

**ప్రత్యక్ష సాక్ష్యం కిడ్నాప్ యత్నాన్ని కట్టు కథ అంటున్నది!**

ముందు కొచ్చే వారు ఎవరూ లేరు. నక్సలైట్లకు భయపడో లేక కోర్టుల చుట్టూ తిరగడం తమకు వీలు కాదనే వుద్దేశ్యంతోనే ప్రత్యక్ష సాక్షులందరూ ముఖం చాటేస్తున్నారు. పెంచలు రెడ్డి ఒక్కరే ధైర్యంగా సాక్ష్యం చెప్పడానికి సిద్ధ పడుతున్నారు. సుబ్బరామ రెడ్డి గారి కుటుంబంతో ఆయనకున్న సాన్నిహిత్యం, సుబ్బరామ రెడ్డి గారి పట్ల ఆయనకున్న గురుత్వం, అభిమానం అటువంటిది.

హత్య జరిగిన తీరును పెంచలు రెడ్డి ద్వారా ఈ విలేఖరి వినడం జరిగింది. ఆ కథనం ఇదీ-

నవంబరు 30 తేది నెల్లూరులో వున్న నాకు సుబ్బరామ రెడ్డి గారు ఫోన్ చేశారు. అప్పుడాయన హైదరాబాదులో వుండినారు. తాను ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో ఒంగోలుకు వస్తున్నానని; అక్కడి నుంచి పొదిలి, చీమకుర్తిల మీదుగా మార్కాపురం వెళ్లి మాజీ ఎమ్మెల్యే కెపి కొండారెడ్డి గారి ఇంట వివాహం చూసుకొని, కనిగిరి మీదుగా సింగ రాయకొండ వచ్చి, అక్కడ ఒకరి ఇంట పలకరింపు చేసి, మధ్యాహ్నానికి నెల్లూరు చేరి, సాయంత్రం హైదరాబాదు ఎక్స్‌ప్రెస్‌లో మళ్లీ ఒంగోలు వచ్చి, ఒక పెండ్లి విందుకు హాజరై, రాత్రికి

కొరవ 12 పేజీలో

# ఫైవ్‌స్టార్ హోటళ్లకు పండుగే!

ఆర్థిక సరళీకరణ, తదనంతర పరిణామాల వల్ల ప్రధానంగా ప్రయోజనం పొందిన పారిశ్రామిక రంగాలలో హోటళ్లు ఒకటి. విదేశాల నుంచి, స్వదేశం నుంచి కూడా వ్యాపారస్తుల రాకపోకలు పెరిగి పోయాయి. ఢిల్లీ, బొంబాయి నగరాలలో ఈ తాకిడి అధికంగా వుంది. ఫైవ్ స్టార్ హోటళ్లలో దిగే వ్యాపార యాత్రికుల సంఖ్య ఏటేటా 10 శాతం లెక్కన పెరుగుతూనే వుందని అంచనా. బొంబాయిలో వివిధ ఫైవ్ స్టార్ హోటళ్లలో 7100 గదులు, ఢిల్లీలో 7300 గదులు వున్నాయి. ఇంత పెద్ద సంఖ్యలో గదులున్నా అక్యుపెన్సీ రేటు 80 శాతం తగ్గక పోవడాన్ని బట్టి ఈ హోటళ్లకు పెరుగుతున్న గిరాకీని అర్థం చేసుకోవచ్చు. ఈ రెండు నగరాల తర్వాత మద్రాసు, కలకత్తా, బెంగుళూరు, జైపూరు, గోవా, ఆగ్రాలలో వ్యాపార యాత్రికుల రద్దీ బాగా కన్పిస్తున్నది.

ఫైవ్‌స్టార్ హోటళ్లకు విదేశీ యాత్రికులు వచ్చినప్పుడు వాటికి అదనపు లాభం. వీరి నుంచి సాధారణంగా డాలర్ల రూపంలో రూము

**రేట్లు పెరిగే కొద్దీ డిమాండూ హెచ్చుతూంది!**

బాడుగ వసూలు చేస్తారు. స్వదేశీయుల కంటె 30 శాతం వరకు అదనపు ఛార్జి చేస్తారు. ఇటీవల డాలరు ధర 31 నుంచి 35 కి పెరగడంతో ఈ హోటళ్ల ఆదాయం వున్నట్లుండి పెరిగి పోయింది. విదేశీ యాత్రికుల వల్ల ఇంత ఆదాయం వుండడంతో హోటళ్ల వారు వారిని ఆకర్షించడానికి పలు పథకాలు వేస్తు తున్నారు. హోటల్ ఇండస్ట్రీలో ఇప్పుడు నికర లాభం 25 నుంచి 30 శాతం వరకు వుందని అంచనా.

ఫైవ్‌స్టార్ హోటళ్లు నడపడంలో దేశంలో ప్రధానంగా నాలుగు గ్రూపులు కీలక పాత్ర వహిస్తున్నాయి.

## ఇండియన్ హోటల్స్

ఇది చాలా పెద్ద గ్రూపు. 41 హోటళ్లు, 2200 ఫైవ్ స్టార్ గదులు వున్నాయి. 1999 లోపల పలు కొత్త హోటళ్లు నిర్మించి గదుల సంఖ్యను రెట్టింపు చేయాలని పథకాలు వేస్తున్నారు. మొన్న మే నెలలో యూరో ఇష్యూ ద్వారా 86 మిలియన్ డాలర్లు (రు. 300 కోట్లు) వసూలు చేశారు. వీరి షేర్ క్యాపిటల్ రు. 45 కోట్లు.

కొరవ 10 పేజీలో

# కొత్త షేర్లు కొనదగినవి కావు!

ఈ వారం కేవలం 3 కంపెనీలు మాత్రమే పబ్లిక్ ఇష్యూలు విడుదల చేస్తున్నాయి. అన్నీ రు. 10 ల ధరకే; ప్రీమియం లేదు.

కాపర్ వైరు తయారు చేసే వ్యాపారంతో ఎన్‌కో ఇండస్ట్రీస్ సంస్థ షేర్లు విడుదల చేస్తున్నది. వీరి లాభం కాపర్ లోహానికి విదేశాలలో, మన దేశంలో వున్న ధరల వ్యత్యాసం పై ఆధార పడి వుంటుంది. ఈ రోజు అంతర్జాతీయ మార్కెట్‌లో కాపర్ ధర తక్కువగా వుంది. అందువల్ల దిగుమతులు పెరిగి స్వదేశీ సంస్థలకు నష్టం వస్తుంది. ఈ కంపెనీ షేర్‌కు దరఖాస్తు చేయడం దండగ.

గోప్లి లీజింగ్ అండ్ ఫైనాన్స్ కంపెనీ షేర్ మరీ దండగ. ఈ ప్రమోటర్లు ఇది వరకు 4 కంపెనీలు స్థాపించారు. అందులో మూడు కంపెనీలు విపరీతమైన నష్టాలలో వున్నాయి. అప్లయ్ చేయడం అనవసరం.

మత్రా క్యాపిటల్స్ కూడా ఫైనాన్స్ కంపెనీ; వీరికి ఈ రంగంలో ఏ మాత్రం అనుభవం లేదు. వీరు ఇష్యూతో సేకరించే డబ్బుతో తమ స్వంత ఆస్తులు స్థిర పరచుకునే వుద్దేశ్యంతో వున్నట్లున్నారు. ఈ షేరుకు దరఖాస్తు చేయడమూ అనవసరం.

**డాక్టర్ ఎ.దుర్గాప్రసాద్**

## ప్యూజో కారుకూ డబ్బు రాలేదు!

పాల్ ప్యూజియెట్ కంపెనీ గత వారంలో విడుదల చేసిన 168 కోట్ల డిబెంచర్ల ఇష్యూ సబ్ స్క్రయిబ్ కాలేదు. కేవలం 70 కోట్లు వచ్చాయి. షేర్ల పబ్లిక్ ఇష్యూ మాత్రం రెండు రెట్లు ఓవర్ సబ్ స్క్రయిబ్ అయ్యింది.

డిబెంచర్ల ఇష్యూకు అండర్ రైటర్స్ వున్నందు వల్ల ఇష్యూ రద్దు కాదు.

## కొనతగిన షేరు

హోటల్ పరిశ్రమలో షేర్ల పై పెట్టుబడి పెట్ట దల్చిన వారు ఈ క్రింది కంపెనీలను పరిగణించ వచ్చు.

భరత్ హోటల్స్: హిల్టన్ బ్రాండ్ నేమ్ కల్గిన ఈ హోటల్ న్యూఢిల్లీలో వుంది. ఈక్విటీ రు. 12 కోట్లు, ఇపిఎస్ రు. 26 లు. మార్కెట్ రేటు రు. 190 లు. పిఇ రేషియో 7. సెప్టెంబరు 95 నాటికి 30 కోట్ల వ్యాపారం మీద 14 కోట్ల లాభం చూపించారు. త్వరలో 30 కోట్లతో చిన్న జిడిఆర్ ఇష్యూ విడుదల చేస్తున్నారు. త్వరలో వీరి యాజమాన్యం, హిల్టన్ నిర్వహణలోనే బొంబాయి, గోవాలలో హోటళ్లు నిర్మించ బోతున్నారు. ఈ హోటల్ షేర్ కొంటె నష్టం రాదు.

ఏషియన్ హోటల్స్: హ్యాత్ రీజెన్సీ నిర్వహణలో వీరికి న్యూఢిల్లీలో 525 గదులు కల్గిన ఫైవ్ స్టార్ హోటల్ వుంది. మొన్నటి సెప్టెంబరు ఫలితాల ప్రకారం 55 కోట్ల అమ్మకాల మీద 22 కోట్ల లాభం వచ్చింది. ఈక్విటీ రు. 16 కోట్లు. ఇపిఎస్ రు. 32 లు. మార్కెట్‌లో షేర్ విలువ రు. 230 లు. పిఇ రేషియో 7:2 ఈ షేరుకు భవిష్యత్‌లో మంచి విలువ వస్తుంది.

ప్లేగు వంటి అంటు వ్యాధులు సోకినప్పుడు, బొంబాయి బాంబు ప్రేలుళ్ల వంటి సంఘటనలు జరిగి నప్పుడు హోటళ్ల షేర్లు పడిపోతాయి.

## తుపాకుల వర్షం

పశ్చిమ బెంగాల్‌లోని పురులియా జిల్లాలో అంత ర్జాతీయ నేరస్తుల ముఠా కురిపించిన తుపాకుల వర్షం బహిర్గతంగా దేశ భద్రతకు, అంత ర్గతంగా శాంతి పరిరక్షణకు ఏర్పడనున్న ముప్పును సూచిస్తున్నది. పలు దేశాలకు చెందిన క్రిమినల్స్ ఒక ముఠాగా ఏర్పడి, బల్గేరియాలో ప్రాణాంతక ఆయుధాలు కొని, పాకిస్తాన్‌లో వాటిని దాచి, అదును చూసి ఇండియాకు వచ్చి, వాటిని భద్రంగా ప్యారా చూట్ల సహాయంతో క్రిందకు దించి తప్పించుక పారిపో గలిగారు. ఇంగ్లీషు సినిమాలో వలె జరిగి పోయిన ఈ పకడ్బందీ వ్యవహారాన్ని పసి గట్ట లేక పోవడం మన గూఢచార, రక్షణ శాఖల వైఫల్యాన్ని సూచిస్తుంది. ఆ నేరస్తుల కర్మ గాలి ప్యారా చూట్లలో దిగిన తుపాకులు గాలి వాటున ఊర్ల మధ్య పడడంతో జనం దృష్టి నాకర్షించి వార్త బయటకు తెలిసింది కాని, అవి చేర వలసిన గమ్యాన్ని సరిగ్గా చేరి వుంటే ఏదీ బయట పడేది కాదు. వీరు కనీసం 350 ఎకె 47 తుపాకులు; అంతే సంఖ్యలో ఎకె 56 తుపాకులు, 100 వరకు రాకెట్ లాంచర్లు, పెద్ద సంఖ్యలో రివాల్వర్లు, గ్రనేడ్లు, మందు గుండు సామగ్రి, డిటోనేటర్లు, జార విడిచి వుంటారని అంచనా. అయితే ఇప్పటికి అందులో సగం కూడా పోలీసుల స్వాధీనం కాలేదు. పురులియా జిల్లాలోని పలు గ్రామాల ప్రజలు ఎవరికి దొరికిన తుపాకులు వారు పట్టుక వెళ్లి దాచి పెట్టుకున్నారు. వాటి కోసం సమీపంలోనే బీహార్ బంది పోట్లు, అస్సాం తీవ్రవాదులు, ఇతర అరాచక వాదులు ఆ గ్రామాలలో తిరుగు తున్నారు. అధిక ధరలు చెల్లించైనా సరే - వాటిని తాము దక్కించు కోవాలని ఆరాట పడుతున్నారు. విమానం నుంచి జార విడిచిన ఆయుధాలన్నీ తీవ్ర వాదుల చేతికి చేరితే రెండు మూడు రాష్ట్రాలలో అరాచకం సృష్టించ డానికి సరి పోతాయట. అంత పెద్ద సంఖ్యలో ఆయుధాలను ఈ నేరస్తులు ఎవరికి చేరవేయ దలిచారు? వీరికి ఆ డబ్బు ఎవరు చెల్లించారు? ఇండియాకు అమాయకుల వలె వచ్చి, వారణాసిలో క్రిందకు దిగి, వెళ్తూ వెళ్తూ తుపాకుల వర్షం కురిపించి వెళ్తుంటె సైన్యం ఎందుకు పసిగట్ట లేక పోయింది. అక్కడ నుంచి థాయిలాండ్ వెళ్లి కూడా అట్నుంచి అటు తప్పించుకొని పారి పోకుండా వారు మళ్లీ మద్రాసుకు అంత ధైర్యంగా ఎట్లా రాగలిగారు? సైన్యం, పోలీసులు వుండి కూడా బొంబాయిలో ఆ విమానం నుంచి ఒక కీలక క్రిమినల్ ఎట్లా తప్పించు కోగలిగాడు? వీరు ఎవరికి ఈ ఆయుధాలు చేర వేయ దలిచారు? కరాచీలో మరికొన్ని దాచి వుంచామని చెప్తున్నారంటే - పాకిస్తాన్ వీరి చేత ఈ దుర్మార్గం జరిపించిందా? పాకిస్తాన్ ప్రమేయం లేకుండా వుంది వుంటే వీరు రెండు నెలల పాటు కరాచీలో అవకాశం ఎదురు చూస్తూ మకాం పెట్టినా వారి పాస్ పోర్టులలో పాకిస్తాన్ ముద్ర ఎందుకు లేదు? విమానానికి సంబంధించిన డాక్యు మెంట్లలో పాకిస్తాన్ గుర్తులు లేకుండా ఎందుకు జాగ్రత్త పడ్డారు?

భారత దేశాన్ని అల్ల కల్లోలం చేయడానికి పాకిస్తాన్ పన్నే అసంఖ్యాక కుటిల కుట్రలలో ఇదీ ఒకటి అని భావించాల్సి వస్తున్నది. కాశ్మీర్ సరి హద్దులలో సైన్యం గస్తీ పెరిగి, దొంగ చాటుగా ఆయుధాలు చేర వేయడం అలివి కాక పోవటంతో వాయు మార్గాన మారణ హోమానికి సమిధలు సమ కూర్చడానికి వారు కుట్ర పన్ని నట్లున్నారు. దాన్ని ముందుగా పసిగట్టి నివారించ లేక పోవడం మన భద్రతా వ్యవస్థ వైఫల్యం క్రిందే పరిగ ణించాలి. నాలుగైదు నెలల క్రితం కేంద్ర మంత్రి ఎన్‌కెపి సాల్వే ప్రయాణిస్తున్న హెలికాప్టర్ సరిహద్దు దాటి ఒక్క కిలో మీటరు దూరం వెళ్లగానే పాకిస్తాన్ సైన్యం తుపాకి కాల్పులు జరిపింది. సరి హద్దులలో వారు అంత మెళకువగా వ్యవహ రిస్తున్నారు. కాని మన భద్రతా దళాలు మాత్రం ఏకంగా ఒక విమానం లోపలికి వచ్చి, నింపాదిగా ఆయుధాలు విసిరేసి పోయినా గమనించ లేదు. క్షమించ దగిన పొరపాటు కాదిది.

ఏది ఏమైనా అదృష్టం బాగుండి ఆ కిరాతక క్రిమినల్స్ దొరికారు. వారి నుంచి స్పష్టంగా మొత్తం కుట్రను చెప్పించ వలసి వుంది. ఈ దుర్మార్గంలో పాకిస్తాన్‌కు ప్రమేయం వుంటే, ఆ నిజాన్ని మొత్తం ప్రపంచం గుర్తించి, గర్హించే రీతిలో ప్రచారం చేయాలి. బొంబాయి బాంబు ప్రేలుళ్ల కిరాతకంలో, కాశ్మీర్ తీవ్రవాద మారణ హోమంలో, పంజాబ్ నరమేధంలో పాకిస్తాన్ పాత్ర, ప్రోత్సాహం వున్నదని స్పష్టంగా రుజువై నప్పటికీ అంత ర్జాతీయ వేదిక మీద వారి నీచత్వాన్ని ఎండ గట్టడంలో మన నాయకులు విఫల మౌతున్నారు. తీవ్రవాదం పట్ల కల్లబొల్లి కబుర్లు చెప్పే అమెరికా ఈ విషయంలో దొంగాట ఆడుతూ పరోక్షంగా పాకిస్తాన్‌ను సమర్థిస్తున్నది. ఈ పాటి కెప్పుడో తీవ్రవాద దేశంగా ప్రకటించి ఆంక్షలు విధించాల్సింది పోయి, ఇంకా ఆయుధాలు ఇచ్చి, నిధులు సరఫరా చేసి అండగా నిలుస్తున్నది. పురులియా దుర్మార్గం ద్వారానైనా అమెరికా ఇటువంటి తప్పుడు పనులకు పాల్పడ కుండా నిలువరించి, పాకిస్తాన్ వికృత చేష్టలకు భరత వాక్యం పలికించాలి.

మన భద్రతా దళాలు, గూఢ చారులు మరింత మెళకువతో మెలగ వలసిన సమయమిది. ఆకాశం నుంచి కూడా ఆయుధాల ముప్పు ఏర్పడుతున్న నిజం గ్రహించి భవిష్యత్‌లో నైనా జాగ్రత పడాలి. ఇప్పటి ఆయుధాలు ఎవరిని వుద్దేశించినవో కనిపెట్టి, ఆ సంస్థను నామ రూపాల్లేకుండా నలిపి వేయాలి.

జమీన్‌రైతు

---

జమీన్‌రైతు

28.12.1945

సం: 0-1-6 సంచిక:8

### అన్నానికి హాహాకారాలు

#### నెల్లూరు జిల్లాలో క్షామదేవతా తాండవం

ముందాది వర్షాలు బాగా లేనందున కొన్ని తాలూకాల్లో వెంకట గిరి, సూళ్లూరు పేట, నాయుడు పేట, తడ, మల్లాం, కందుకూరు ప్రాంతాల్లో మెట్ట పైర్లు కూడా సరిగా పండక బంజరుగా వున్నవి. వెనుక చిక్కి పడ్డ వర్షానికి కొన్ని చోట్ల పైర్లు వేశారు. కాని యీ వర్షం చాలినంత కానందున ఆ వోటి చెర్వులు కూడా నిండక వేసిన పైర్లు ఎండిపోయి బొందు కోస్తున్నారు. ముఖ్యంగా వెంకటగిరి, నాయుడు పేట ప్రాంతాల్లో బొందు కోసి అమ్ము కుంటున్నారు. తెగుళ్ల వల్ల వున్న కొద్ది పైరు కూడా నాశన మగుచున్నది.

నీర్లు సున్న, సూళ్లూరు పేట తాలూకాలో కాళంగి, స్వర్ణ ముఖి పారుదల కొద్ది గ్రామాలు తప్ప తక్కిన వాటిలో పైర్లు ఎండిపోయి బొందు కోస్తున్నారు. ఈ ప్రాంతా లన్నిటిలో ఆహార ధాన్యాదులకు విపరీత కరువు ఏర్పడింది. ఎక్కడ చూచినా గింజలు దొరకక మారు మూల పల్లెల వాండ్లు కూడా తాలూకా సెంటర్ల కెగ బ్రాకు చున్నారు. సూళ్లూరు పేట, నాయుడు పేట, తడ, వెంకట గిరిలో మరీ వారం, పది రోజుల నుండి వేల కొలది అన్నాతురత ప్రజలు రోడ్ల వెంట పడివున్నారు. వుదయం 6 గం. నుండి సాయంకాలం 6 గంటల వరకు వేచి వున్నా మనిషికి 1/2 శేరు బియ్యం కూడా దొరకడం లేదు.

అల్వారు గడ్డలు తిండి లేక తింటున్నారు. దీనివల్ల వాంతులు చేసుకొని ఆరోగ్యాన్ని చెరుచు కుంటున్నారు.

పైగా ఈ ప్రాంతాలన్నీ ఇలా క్షోభిస్తుంటె గూడూరు సబ్ కలెక్టరు గారు 22.12.45 తేది నాయుడు పేట నుండి గూడూరుకు 150 బస్తాలు, కోటకు 500 బస్తాలు, వెంకట గిరికి 300 బస్తాలు, రాపూరుకు 100 బస్తాలు తక్షణం పంపించుటకు వుత్తర్వులు జారీ చేశారు.

డెల్టాలో కూడా పైర్లు కొన్ని చోట్ల ఎండి పోతున్నవి పెన్నారు ఆయకట్టు క్రింద గూడా వెనక చిక్కి సాగు అయ్యి ప్రదేశాలు యెండి పోయే సూచన లున్నవి.

కావలి తాలూకాలో చెరువు లన్నీ యెండి పోయినాయి. ఆదిలో గూడ యే చెరువులోను పదిహేను రోజులకు మించి నీరెలేదు. కాబట్టి ఈ ఏడు పంట సర్వ నాశనం. పశు గ్రాసానికి గూడ విపరీతమైన కరువు యేర్పడింది. పశువులు దీన వదనములతో, అన్నం లేక అల్లాడే తమ రైతును చూస్తున్నాయి.

కొరవ 10వ పేజీలో

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

---

# హరిజనుడని పిలిస్తే తప్పు ఎందుకౌతుంది?

రాష్ట్ర ప్రభుత్వం 'హరిజన్' అనే పదాన్ని నిషేధిస్తూ, షెడ్యూల్ కులానికి చెందిన వ్యక్తిని హరిజన్‌గా పిలిస్తే తీవ్రంగా పరిగణించి, కఠినంగా శిక్షిస్తుందని ముఖ్య మంత్రి ప్రకటించడం విడ్డూరంగా వుంది. హరిజన్ అనే పదంలో దోష పూరితమైన విషయం ఏమిటో అర్థం కావడం లేదు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు గనుక వారిని దేవుని మనుమ లనడం ఉచితమని మహాత్మా గాంధీ సూచించారు. ధేడ్ కులానికి (షెడ్యూల్ కులం) చెందిన విద్యా వంతుడైన ఒక జర్నలిస్ట్ అంటరాని తనానికి గురైన వారికి హరిజన్ అనే పేరు పెడితే బాగుం టుందన్నారు. గాంధీ గారు అందుకు సంతోషించి, తాను అంత వరకు నడుపు తుండిన యంగ్ ఇండియా పత్రిక పేరును హరిజన్‌గా మార్చి అంటరాని తనానికి వ్యతిరేక పోరాటం కొనసాగించారు. 1932 లో ఈ పత్రిక ప్రారంభ సంచికకు డాక్టర్ అంబేద్కర్ సందేశం పంపారు. కానీ అందులో ఆయన హరిజన్ అనే పదానికి అభ్యంతరం తెలుప లేదు. దేశ ప్రజలు గాంధీజీ సలహాలు, ఆదేశాలు గౌరవించ బట్టే అంటరాని తనం, ఎస్‌సిలకు విద్యా వుద్యోగాలలో రాయితీలు మంజూరు చేయడం జరిగింది. కాని చరిత్ర తెలియని అజ్ఞానులు, జాతి పిత పై దుష్ప్రచారం చేసి హరిజన్ పదం తొలగించి షెడ్యూల్ కులాల వారికి దళితుడు అనే టైటిల్ తగిలింప చేయాలను కోవడం, ప్రభుత్వం దాన్ని సమర్థించడం సమంజసంగా లేదు.

నెల్లూరు -ఆర్. దేవదానం

**జనవాణి**

---

### సెంట్రల్ బ్యాంకుకు కృతజ్ఞతలు

రాష్ట్ర ప్రభుత్వం డిశంబరు 7 తేది జి.ఓ. నెం. 270 ని అనుసరించి 95 జూలై నుంచి డి.ఎ. అరియర్స్ మంజూరు చేసింది. నెల్లూరు సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా శాఖ వారు వీటిని వెంటనే తమ పెన్షనర్ల ఖాతాలలో జమ చేసి, ఎప్పటిలా ప్రథమ స్థానంలో వున్నారు. బ్యాంకు సిబ్బంది ఈ పని

కొరవ 8 పేజీలో

---

## సణుగుడు

### ★ శ్రమదానం పెద్ద ఇంద్రజాలం

చంద్రబాబు నాయుడు గారి ఆరాటం చూస్తే జాలి కల్గుతూంది. గోదావరి వరద ప్రవాహంలో కొట్టుక పోయే వాడు గడ్డి పోచ, ముక్క, తోక, కర్ర ముక్క వంటివి ఏది కన్పిస్తే దానిని పట్టుకొని ఒడ్డున పడాలని ప్రయత్నించినట్లు, తెలుగు రాజకీయ నది సముద్రంలో మునగానాం తేలానం అన్నట్లు నానా తంటాలు పడుతున్నారాయన. జనం దృష్టిని మరల్చడానికి చంద్రబాబు పడే పాట్లు

### డోలేంద్ర

అన్నిన్ని కావు. హైదరాబాదులో కూర్చుంటే ఎమ్మెల్యేలు ఝుమ్మని చెవిలో జోరీగల్లాగా మూగు తున్నారు. వారికి మహా ఆత్రంగా వుంది. ఎన్టీఆర్‌ను వదలి వచ్చి నెలలు గడిచి పోతున్నా నయా పైసా ఆదాయం లేదు. ఒక్క కాంట్రాక్టు ఇప్పించ లేకున్నారు; ఒక్క క్లెయిమ్ మంజూరు చేయించ లేకున్నారు; అభివృద్ధి కార్యక్రమాల సంగతి సరేసరి! పదవులూ రావడం లేదు. ఆకలితో నకనక లాడే మ్యాన్ ఈటర్ పులుల వలె అసహనంగా పచార్లు చేస్తున్నారు వారు. వారి బాధ వారిది. చంద్రబాబు ఎప్పటి వరకు వుంటాడో తెలియదు; ఎప్పుడేమి జరగనున్నదో తెలియదు. తమకేమీ జరగకుండానే చంద్రబాబు దిగి పోతాడేమో నన్నది వారి భయం.

ఎమ్మెల్యేలను తప్పించు కోవడం చంద్రబాబుకు పెద్ద తలనొప్పిగా తయారైంది. హైదరాబాదులో వుంటే వారిని భరాయించడం కష్టం. హైదరాబాదులో వుంటే చేయడానికి పని కూడా ఏమీ లేదు. కొరవ 6 పేజీలో







# "మద్రాసుకు నీళ్ళివ్వం- నెల్లూరును ఎండబెట్టం"

జిల్లాలోని పైర్లను నీళ్లు లేకుండా ఎండ గట్టి, అప్పుడు సోమశిల రిజర్వాయర్‌లో వున్న నీటిని మద్రాసుకు తరలించే విషయమై గత వారం జమీన్‌రైతు ప్రచురించిన విశ్లేష ణాత్మక వార్త పై సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి సుదీర్ఘ వివరణ ఇచ్చాడు. 26 తేది విజయ మహల్ గేటు వద్ద తెలుగు దేశం పార్టీ జిల్లా కార్యాలయంలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడా రాయన. సోమశిల నుండి మద్రాసుకు నీరు తరలించే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం ప్రస్తుతానికి విరమించినట్లు చెప్పారు. అంటే ప్రభుత్వం జిల్లా రైతులకు అన్యాయం జరిగే ప్రమాద ముందని తెలిసీ, ఇటువంటి ఆలోచన చేసిందన్న మాటేగా? సోమశిల నుండి కండ్లేరును నింపేందుకు 3 టి.ఎం.సి.ల నీరు వదలిన మాట వాస్తవమే అయినా, అవి అక్కడ దాకా చేరలేదన్నారు. అక్విడెక్టులు పూర్తి కాకుండా ఈ కరువు కాలంలో విలువైన నీటిని వృధా చేసినందుకు అధికారులు ప్రజలకు ఏమి సమాధానం చెబుతారో వేచి చూడాలి!

26 తేది నుండి 3,300 క్యూసెక్కుల నీరు రిజర్వాయర్ లోపలకు పై నుండి విడుదల చేయను ముఖ్య మంత్రి, రాష్ట్ర భారీ నీటి పారుదల శాఖా మంత్రి అంగీక రించినట్లు చెప్పారు. సోమశిలకు ఇది వరకు 2,200

> **సోమశిల నీటి దగాపై ఎమ్మెల్యేలలో కదలిక వచ్చింది!**

క్యూసెక్కులే నీరే విడుదల అయ్యేదని అదనపు నీటి విడుదల విషయమై తాను, సిపిఎం ఎమ్మెల్యే జక్కా వెంకయ్య మంత్రులకు నచ్చజెప్పడమే ఈ నిర్ణయానికి కారణ మన్నారు. ప్రస్తుతం విడుదల చేసే నీరు ప్రాజెక్టు చేరేసరికి 2900 క్యూసెక్కులే మిగులుతుంది కాబట్టి జిల్లాలో ఎకరం పొలం కూడా నీరు లేకుండా ఎండ దన్నారు. ఈ నీటితో కనిగిరి రిజర్వాయరు క్రింద లక్షా 20 వేల ఎకరాలకు 1200 క్యూసెక్కులు, కనుపూరు కాల్వ క్రింద 30 వేల ఎకరాలకు 300 క్యూసెక్కులు, నెల్లూరు ఆనకట్ట క్రింద 80 వేల ఎకరాలకు 800 క్యూసెక్కులు, నెల్లూరు సప్లై ఛానెల్ క్రింద 10 వేల ఎకరాలకు 100 క్యూసెక్కులు, నార్త్ సౌత్ ఛానెల్‌లోని 25 వేల ఎకరాలకు 100 క్యూసెక్కులు, దువ్వూరు బ్రాంచ్ కాలువ క్రింద 5 వేల ఎకరాలకు 50 క్యూసెక్కుల నీటిని విడుదల చేస్తున్నట్లు వివరించారు.

సోమశిలలో ప్రస్తుతం 28.5 టి.ఎం.సి.ల నీళ్లు వున్నాయని, శ్రీశైలం నుంచి 11 టి.ఎం.సి.ల కృష్ణా జలాల్ని కూడా వచ్చి ఇందులో చేరుతున్నట్లు చెప్పారు. ప్రాజెక్టులో 78 టి.ఎం.సి.ల నీరు నిల్వ చేసేందుకు భూసేకరణకు 95 - 96 సంవత్సరంలో ప్రభుత్వం 24 కోట్లు ఖర్చు పెట్టాలని లక్ష్యంగా కొరవ 11 పేజీలో

రమేష్‌రెడ్డి వెరైటీ గ్రీటింగ్స్

# మూడువేల మందికి ఇళ్ళ స్థలం పట్టాలతో హ్యాపీ న్యూయియర్!

నూతన సంవత్సర కానుకగా నెల్లూరు నియోజక వర్గంలో 3 వేల మందికి 1 తేది ఇళ్ల స్థలాల పట్టా లిస్తున్నట్లు మార్కెటింగ్ శాఖా మంత్రి టి. రమేష్ రెడ్డి చెప్పారు. 26 తేది సాయంత్రం పత్రికల వారితో మాట్లాడా రాయన. తాను ఎమ్మెల్యేనయ్యాక ఇప్పటికే 2 వేల మందికి పట్టా లిప్పించానని, ఈ మూడు వేలతో ఆ సంఖ్య 5 వేలకు చేరుతుందన్నారు. ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో ఇంటి స్థలం కోసం అర్జీలిచ్చిన వారి విషయమై ఇక నుండి దృష్టి నిలుపు తానన్నారు. ముఖ్య మంత్రి ప్రకటించిన కొత్త రేషన్ కార్డులలో జిల్లా కోటాగా 50 వేల కార్డుల వరకు రావచ్చునని, టౌన్‌లో ఇప్పటికే 20 వేల కార్డులకు డిమాండ్ వున్నట్లు వివరించారు. శ్రమదాన కార్యక్రమంలో మునిసి పాలిటీలో 14 పనులు చేపట్టేందుకు అధికారులు రంగం సిద్ధం చేసినట్లు చెప్పారు. 1 తేది టౌన్‌లో ఏదో ఒక చోట శ్రమదాన కార్యక్రమంలో తాను పాల్గొన నున్నట్లు మంత్రి వివరించారు. ప్రజల వద్దకు పాలనలో వచ్చిన అర్జీల తాలూకు పనులు చేపట్టేందుకు కోటి రూపాయలను ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిందని, మరో ఒకటిన్నర కోటిని వెంటనే మంజూరు చేయను ముఖ్య మంత్రి అంగీక రించినట్లు మంత్రి తెలిపారు.

# పాపం కలెక్టరు - పేనా వదిలేసి పలుగుపార పట్టితిరుగుతున్నారు!

ప్రభుత్వం జనవరి 1 తేది నుండి మొదలు పెడుతున్న శ్రమదాన కార్యక్రమాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఉత్సాహ వంతుడైన ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ కాసింత ముందుగానే పలుగు పార చేత బట్టారు. శ్రమదాన కార్యక్రమంలో భాగంగా ముందుగా నిధులు మంజూరైన తడికల బజారు, చింతారెడ్డి పాళెం డొంక మీదుగా వెళ్లే పంట కాలువలో పూడిక తీసే పనిని పరిశీలించేందుకు ఆ ప్రాంతానికి 23 తేది కలెక్టర్ వెళ్లారు. ఉత్సాహంతో పని చేస్తున్న ప్రజలను చూసి ఆయనకూ ఎక్కడ లేని హుషారు వచ్చినట్లుంది. పలుగు, పార వుపయోగించి కాసేపు శ్రమపడే సరికి ముచ్చెమటలు పట్టినా ఇన్‌ఛార్జి కలెక్టర్ దాన్ని పట్టించు కోలేదు.

> **నెల్లూరు సంగతులు**

తడికలబజారులోని పబ్లిక్ లెట్రిన్ల ప్రాంతంలో కల్వర్టు నిర్మాణానికి ప్రజలు శ్రమదానంతో పాటు పనికయ్యే ఖర్చు సగం భరిస్తే, మిగతా సగం ప్రభుత్వం తరఫున తాను మంజూరు చేయిస్తానని కలెక్టర్ హామీ ఇచ్చారు.

అదే రోజు స్టోన్ హౌస్‌పేటలోని హరిజనవాడలో గిరిధర్, మునిసిపల్ కమీషనర్, మునిసిపల్ కౌన్సిలర్ల చేత కూడా పళ్లు వంచి పని చేయించారు. ఒక వైపు పంట కాలువ, మరో వైపు రోడ్డు మధ్య వున్న కామాటి వీధి హరిజన వాడలోని నాలుగు సందుల్లో మురుగు నీరు బయటకు వెళ్లే వసతి లేదు. ఇక్కడ కాలువ నిర్మాణానికి శ్రమదానం చేయను కొరవ 11 పేజీలో



గూడూరులో సబార్డినేట్ జడ్జి కోర్టు భవనాన్ని ప్రారంభిస్తున్న హైకోర్టు న్యాయమూర్తి రమేష్ మాధవ్ బాపత్. జిల్లా జడ్జి ఎల్. అప్పారావు, అదనపు జిల్లా జడ్జి బి. చంద్రకుమార్ చిత్రంలో వున్నారు.

# ఆత్మకూరు డిఎస్పీకి అంత మంచితనమైతే ఎట్లా?

ఆత్మకూరు డిఎస్పీగా ప్రస్తుతం పని చేస్తున్న మునుస్వామి మొన్నటి వరకు నెల్లూరు ఇంటలి జెన్స్ శాఖలో సిఐగా పని చేస్తుండే వారు. సామాన్యంగా వివాదాలకు దూరంగా వుండే మనిషి. పోలీస్ కరకు దనం ఆయనలో కనపడదు. ఈ ధోరణే ఆత్మకూరులో పోలీసు శాఖ పరువు పోయేందుకు కారణమైంది. ఇటీవల ఆత్మకూరు టౌన్‌లో జూదం, నెంబర్లాట పెచ్చు పెరిగి పోవడంతో ఎస్ఐ శివ ప్రసాద్ ఇటీవల ఆజారరులను అరెస్టు చేసి అర్ధ నగ్నంగా ఊరేగించి స్టేషన్ వరకు తీసుకొచ్చాడు. ఈ చర్య రాజకీయ నాయకులకు కష్టం కల్గించింది. అరెస్టయిన జూదరులు తమ అనుచరులు కావడంతో, వారిని విడి పించడానికి రచ్చ ప్రారంభించారు. వీరి ప్రమేయంతోనే కొందరు లారీలు తెచ్చి స్టేషన్ ముందు అడ్డం పెట్టి ఎస్ఐ క్షమాపణ చెప్పాలని గొడవ చేశారు. తాను చేయని తప్పుకు క్షమాపణ చెప్పనని ఎస్ఐ గట్టిగా నిలబడడంతో ఈ విషయం వివాదంగా రూపు దాల్చింది. ఇంతలో అక్కడకు వచ్చిన డిఎస్పి మునుస్వామి లారీల వారికి నచ్చచెప్పి పంపి డిపార్టుమెంట్

**పోలీసు పరువు క్షమాపణల పాలు?**

తరఫున జరిగిందేదో జరిగి పోయిందని తన సహజ ధోరణిలో క్షమాపణ చెప్పారట. ఈ విషయం పోలీస్ సైర్యాన్ని దిగజార్చి పారేసిందని పోలీసుల గగ్గోలు. మంచి పని చేసిన ఎస్ఐది తప్పని డిఎస్పి ఎందుకు క్షమాపణ చెప్ప వలసి వచ్చిందని మహిళా సంఘాల విమర్శ. ఈ విషయమై ఎఎస్‌పి సూర్య నారాయణ ఆత్మకూరు వచ్చి విచారణ జరిపారు. మొత్తానికి డిఎస్‌పి మెతక ధోరణి వల్లే తప్పంతా వచ్చి ఆయన నెత్తిన పడింది. పేకాట ఆడే వారిని, దొంగలను వెనకేసు కొని వచ్చి శాంతి భద్రతల సమస్య సృష్టించడం ఆత్మకూరు నాయకులకు తగదు.

## రిటైర్డ్ హెడ్మాష్టర్ మరణం

జిల్లాలోని పెక్కు హై స్కూళ్లలో హెడ్మాష్టరుగా పని చేయడమే గాక ఉత్తమ ఆంగ్ల భాషా బోధకునిగా పేరు పొందిన పి. చెన్నారాయుడు (86) ఇటీవల విశాఖ పట్టణంలో కుమారుని వద్ద మరణించారు. కావలి స్వస్థలమైన చెన్నరాయుడికి భార్య ముగ్గురు కుమారు లున్నారు.

# బుచ్చి స్కూలు ఉత్సవంలో నిర్వాహకులహస్తలాఘవం?

బుచ్చిరెడ్డి పాళెం దొడ్ల లక్ష్మి నరసారెడ్డి పాఠశాల వజ్రోత్సవాలు 22, 23 తేదీల్లో జరిగాయి. అయితే ఊహించి నంత స్థాయిలో ఉత్సవాలు జరగలేదన్న విమర్శ సర్వత్రా వినవస్తున్నది. ఈ ఉత్సవాల నిర్వహణకై డబ్బు వసూలు చేస్తున్నప్పటి నుండే విమర్శలు మొదలయ్యాయి. పాఠశాల పేరుకు తగ్గట్లు వసూళ్లు లక్షల్లో వుండగా లెక్కలు మాత్రం వేలల్లో చూపించడంలో పూర్వ విద్యార్థి సంఘం అధ్యక్షుడు తన హస్తలాఘవం చూపినట్లు వినికిడి. ఈ వసూళ్ల పై ఇటీవల జరిగిన సమావేశంలో గొడవలు రేగి కమిటీ సభ్యుడొకరు రాజీనామా చేసినట్లు విశ్వస నీయంగా తెలిసింది. వజ్రోత్సవాలు మొదలైన 22 తేది స్కూలు విద్యార్థులతో గ్రామంలో ఊరేగింపు నిర్వహించారు. కాని ఈ ఊరేగింపులో ఆ పాఠశాల విద్యార్థుల సంఖ్య కన్నా ఇతర పాఠశాల విద్యార్థినీ, విద్యార్థులే ఎక్కువగా కనిపించారు. సాంస్కృతిక కార్యక్రమాలు కూడా పేలవంగా వుండినాయి. వజ్రోత్సవ నిర్వహణకు డబ్బులిచ్చిన పూర్వ విద్యార్థులకు తప్ప, ఇతర విద్యార్థులకు కనీసం ఆహ్వాన పత్రాలు కూడా పంపలేదు. పాఠశాల భవన నిర్మాణానికి వజ్రోత్సవానికి అతిథులుగా వచ్చిన పూర్వ విద్యార్థుల నుండి లక్షల రూపాయల విరాళాలు వాగ్దాన రూపంలో పొందడంలో మాత్రం కమిటీ వారు కృత కృత్యులయ్యారు.

## కోట న్యాయశాఖ ఉద్యోగుల సంఘం

కోట మునసబు కోర్టులో పనిచేసే ఉద్యోగుల సంఘం ఇటీవల నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొంది. అధ్యక్షునిగా బి.ఎం. చంద్ర శేఖర్ నాయుడు, ఉపాధ్యక్షునిగా కె.బి.కె. మూర్తి, కార్యదర్శిగా ఆర్. మందలేశ్వర రావు, సహకార్యదర్శిగా టి.వి. రమణ రావు, కోశాధికారిగా వి.వి. ప్రసాద రావు, కార్యవర్గ సభ్యులుగా బి. సుబ్బయ్య, ఎం. లక్ష్మిలను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

# ఇటుక బట్టీలు తీయించలేరా?

బుచ్చిరెడ్డి పాళెం మీదుగా వెళ్లే బాంబే రహదారి ప్రక్కన ప్రభుత్వ స్థలాల్లో ప్రైవేట్ వ్యక్తులు ఏర్పాటు చేసుకొన్న ఇటుక బట్టీలను తొలగించడంలో రెవిన్యూ శాఖాధి కారులు తమ అసమర్థతను చాటు కొంటున్నారు. బుచ్చి నుండి రేబాల మధ్యలో బాంబే రహదారి ప్రక్క కొందరు వ్యక్తులు ఇటుక బట్టీలను పేర్చి తమ పబ్బం గడుపు కొంటున్నారు. బట్టీలకు అవసరమైన అన్నీ పనులనూ ప్రభుత్వ స్థలంలోనే చేస్తున్నారు. బట్టీలు రోడ్డు ప్రక్కనే వుండడంతో వాటి నుండి వెలువడే పొగ, దుమ్ము రోడ్డు పై వెళ్లే వాహన చోదకులను తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తున్నాయి. బట్టీలు రోడ్డు పైకి వచ్చేయడం వల్ల పలు ప్రమాదాలు జరుగు తున్నాయి. బట్టీల వల్ల కలుగుతున్న అసౌకర్యాన్ని గ్రహించిన ఒకప్పటి జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర బట్టీల వారి పై తగిన చర్య తీసుకోమని అక్కడి నుంచి వాటిని తొలగింప జేయమని ఎమ్మార్వోను ఆదేశించారు. ఆయన మొక్కుబడిగా తాత్కాలిక నోటీసులు జారీ చేసి వూరుకొన్నారు. ఆ నోటీసుల భూతాన్ని చూపిస్తూ బట్టీల వారి నుండి మామూళ్లు వసూలు

**జిల్లావార్తలు**

చేసుకొంటూ రెవిన్యూ సిబ్బంది కాలం గడుపు తున్నారు. దీనివల్ల బట్టీల వ్యాపారం ఈ రోడ్డు పై దిన దిన ప్రవర్థమానమై పోతున్నది. ఇప్పటి జాయింట్ కలెక్టర్ గిరిధర్ ఈ విషయమై కాసింత శ్రద్ధ తీసుకొని వీటిని తొలగించాలని మండల ప్రజలు కోరుతున్నారు.

## గూడూరు పి.ఆర్.రెడ్డి క్లబ్‌కు నూరేళ్లు

గూడూరులోని పెల్లేటి రామిరెడ్డి క్లబ్ శత వార్షిక సంబరాలు 16, 17 తేదుల్లో ఘనంగా జరిగాయి. తొలి రోజు రాష్ట్ర స్థాయి క్యారమ్స్ పోటీలను క్లబ్ అధ్యక్షులు తలమంచి సిద్ధారెడ్డి ప్రారంభించారు. శత వార్షికోత్సవ చిహ్నంగా 2 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన లైబ్రరీ భవనాన్ని నవేరా శ్యామ్ సుందర రెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి వందేళ్ల క్రితం క్లబ్ ప్రారంభించిన పెల్లేటి రామిరెడ్డి, పొన్నలూరు కోటారెడ్డి, రాఘవ రెడ్డి, పోలయ్య నాయుడులను గుర్తుకు తెచ్చారు. గూడూరు ఆర్డీఓ శ్రీనివాస రాజు, డిఎస్పీ రాధా క్యారమ్స్ పోటీలలో

కొరవ 7-పేజీలో

# గూడూరు దేముడి స్థలం రాత్రికి రాత్రే మాయం!

గూడూరు టౌన్ నడిబొడ్డులో వున్న ధర్మరాజుల స్వామి దేవ స్థానానికి సంబంధించిన స్థలాన్ని దేవాదాయ, ధర్మాదాయ శాఖ వుద్యోగులు, వ్యాపారస్తులకు అమ్మి సొమ్ము చేసుకొన్నారు. దేవస్థానం వెనుక రెండు అంకణాల భారీ స్థలంలో గత పాలక వర్గం ఒక గదిని కట్టించి దాన్ని వంట శాలగా ఉపయోగించుకొనే వారు. వారం రోజుల క్రిందట అర్ధరాత్రి దాని ప్రక్కనే మరో రూమ్ వెలిసి పోయింది. రూము నిర్మాణం చేసుకొన్న వ్యక్తి స్థానిక దేవస్థానం అధికారులకు వేలాది రూపాయలు కానుకగా సమర్పించు కున్నట్లు తెలిసింది. ఇదేమి చోద్యమని పలువురు ప్రశ్నించగా దేవస్థానం అధికారులు చెప్పిన సమాధానం మరింత విస్మయ పరిచింది. దేవాలయంలో కాపురముండే వాచ్‌మెన్ ప్రతి నెలా బహిష్టు అయ్యి దేవాలయంలో తిరగడం వల్ల ఆలయం అపవిత్ర మవుతుందని; దాన్ని నివారించను దేవాలయం వెనుక దారి ఏర్పాటు చేసి ఆమెకు గది కట్టించి ఇచ్చినట్లు చెపుతున్నారు. కాని దేవాలయంలో పనిచేసే వాచ్‌మెన్ స్త్రీ కాదు; చీరలు కట్టుకొని తిరిగే నపుంసకుడు కావడంతో దేవస్థానం అధికారులు చెప్పిన సమాధానానికి ప్రజలు ముక్కు మీద వేలేసు కొంటున్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## విలక్షకుడు

### కొత్త కలెక్టర్

నెల్లూరు కొత్త కలెక్టర్‌గా శ్రీ డి. సాంబశివ రావు నియమితులైనారు. ఇయనిప్పుడు నల్గొండ జిల్లా జాయింట్ కలెక్టర్‌గా వున్నారు. కృష్ణా జిల్లా వాస్తవ్యులు. పశువుల డాక్టర్‌గా వుండి, ఆ తర్వాత ఐఎఎస్ పుత్తీర్ణులైనారట. నల్గొండలో రాజకీయ వాదులను హడలెత్తించిన వారని పేరుంది. ఎవరికీ భయపడే తత్వం కాదట. అంతేమేమి నుగుణా లున్నాయో అక్కడకు వచ్చిన తర్వాత చూస్తే గాని తెలియదు.

నెల్లూరు జిల్లా ఎమ్మెల్యే లందరికీ నతీష్ చంద్రను నియమింప జేసుకోవాలనే ఆలోచన వుండింది. కాని చంద్రబాబు వారి మాట వినలేదు.

### జిల్లా జైలులో గణేశ్

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి హత్య కేసులో ప్రధాన నిందితుడైన గణేశ్‌ను 23 తేది రిమాండ్ పై నెల్లూరు జిల్లా జైలుకు తరలించారు. అయితే అంత సంచలనాత్మక నక్సలైట్ ఖైదీలను భరించే సామర్థ్యం తనకు లేదని జైలర్ గగ్గోలు పెట్టడంతో, మరునటి రోజా రాజమండ్రి సెంట్రల్ జైలుకు తరలించారు. ఖైదీలను చూసి జైలరు భయపడ మేమిటండీ, బాబూ! ఎవరైనా వింటే నవ్వి పోరూ!

### జయశంకర కృష్ణ

ఎన్టీఆర్ కుమారుడు శ్రీ నందమూరి జయశంకర కృష్ణ 28 తేది నెల్లూరు వచ్చారు. తమ తల్లి స్వర్గీయ బసవ తారకం స్మారక సంస్థ జిల్లా కమిటీని నియమించను వచ్చారాయన. స్మారక సంస్థ తరపున మూలపేటలో ఒక గ్రంథాలయం, కుట్టు శిక్షణా కేంద్రం నెలకొల్పే ఆలోచన వుందన్నారు. తన తండ్రి ఎన్టీఆర్‌ను తిరిగి ముఖ్య మంత్రిని చేయడమే తన ఆశయమని వాక్రుర.

### ఒంగోలులో కోట్లు ఖర్చు పెట్టిన మాగుంట

ఒంగోలు పార్లమెంటు సభ్యుడు మాగుంట సుబ్బరామ రెడ్డి హత్య జరిగిన సమయంలో ఆయన ప్రక్కనే వుండి, బుల్లెట్ దెబ్బ తిని మద్రాస్ అపోలో ఆసుపత్రిలో శస్త్ర చికిత్స అనంతరం కోలుకొన్న మాజీ శాసన సభ్యుడు శ్రీ చెన్నారెడ్డి పెంచలు రెడ్డి 26 తేది నెల్లూరు రాయాజీ వీధిలోని తన కార్యాలయంలో పత్రికల వారితో మాట్లాడారు. ప్రకాశం జిల్లాలో పామూరు, కందుకూరు, కనిగిరి, ఒంగోలు, కావలి తదితర ప్రాంతాల ప్రజల దాహార్తి తీర్చను ఏర్పాటు చేసిన కార్యక్రమానికి సంవత్సరానికి కోటి 44 లక్షలు ఖర్చయ్యేవట. 16 జూనియర్ కాలేజీలు, 3 డిగ్రీ కళాశాలల్లో సిబ్బంది, లెక్చరర్ల జీతాలకు ఏటా కోటిన్నర ఖర్చు పెట్టే వారని; ఈ చెక్కులన్నీ తన చేతుల మీదుగానే ఇచ్చే వాడినని చెప్పారాయన.

కావలి టిటిడి కళ్యాణ మండపానికి 4 లక్షలు, పొది మంజిలీకు 5 లక్షలు, కందుకూరు, కనిగిరి, ఒంగోలులలో వివిధ కళ్యాణ మండపాలకు 40 లక్షలు విరాళంగా ఇచ్చారట. కావలి,ఉలవపాడు, టంగుటూరు, సింగరాయ కొండ జాతీయ రహదారులకు, టౌన్‌లో సిమెంటు రోడ్లకు, కందుకూరు, కనిగిరి, పామూరులో రోడ్లకు సుబ్బరామ రెడ్డి గారు 49 కోట్ల కేంద్ర ప్రభుత్వ గ్రాంటు మంజూరు చేయించినట్లు చెప్పారు. రాష్ట్రంలో ఎక్కడ అంబేద్కర్ విగ్రహాలు నెలకొల్పు తామని ఎవరు వచ్చినా విగ్రహాల ఖర్చు ఆయనే భరించినట్లు చెప్పారు. నరసారావు పేట, గుంటూరు, బాపట్ల నియోజక వర్గాలకు కూడా ఎన్నో సహాయాలు చేసినట్లు చెప్పారు. ఒక నియోజక వర్గానికి కోట్లాది రూపాయలు స్వంత డబ్బు ఖర్చు పెట్టిన మరో ఎమ్పీ దేశంలోనే లేడని, ఆయన్ను కోల్పోవడం ఆ ప్రజల దురదృష్టమని పెంచలు రెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు.

విఆర్‌సి సెంటర్‌లో దీక్షా శిబిరంలో దారుణ హత్యకు గురైన వల్లం నాగార్జున

### పార్లపల్లె డాక్టర్‌కు అమెరికా గౌరవం

మద్రాసు వెటర్నరీ కళాశాలలో మైక్రో బయాలజీ విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా వున్న డాక్టర్ యరబోలు కృష్ణ మోహన రెడ్డి గారికి న్యూయార్క్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు తమ సంస్థలో యాక్టివ్ మెంబర్‌గా గౌరవ స్థానం కల్పించారు. కోళ్లలో వచ్చే వైరస్ వ్యాధుల పైన, ఇమ్యునాలజీ పైన ఆయన చేసిన పరిశోధనలకు గుర్తింపుగా ఈ గౌరవంతో సత్కరించారు. ఈ అకాడమీ - సైన్సు, పరిశోధనా రంగాలలో ప్రపంచ స్థాయిలో శాస్త్రవేత్తల మధ్య సమన్వయం, సమాచార మార్పిడి వంటి సేవలందిస్తుంటుంది.

దీనితో పాటుగా, అమెరికాలోని న్యూజెర్సీకి చెందిన 'మారియోస్ హుతుజీవం' పుస్తకంలోను కృష్ణ మోహన రెడ్డి పేరు ప్రచురించారు.

కృష్ణ మోహన రెడ్డి పార్లపల్లి వాస్తవ్యుడు; వింజమూరు కాలేజీ విద్యార్థి. ఆయనకు మా అభినందనలు.

### దీక్షా శిబిరంలో యువకుడి దారుణ హత్య

మాగుంట సుబ్బరామ రెడ్డి హత్య కేసును సిబిఐకి అప్పు చెప్పాలని డిమాండ్ చేస్తూ నిరాహార దీక్ష చేస్తుండిన వల్లం నాగార్జున అనే యువకుడ్ని అదే శిబిరంలో దారుణంగా నరికి చంపారు. 26 తేది వేకువ ఝామున జరిగింది ఘోరం.

నాగార్జున పివి ప్రసన్న రెడ్డి అనుచరుడు. వాకలి వీధి రౌడీ రాజకీయాలలో వివాదాస్పద వ్యక్తి. అక్కడే వున్న హనుమాన్ వ్యాయామశాల నిర్వహణలోనూ అతడికి ఇతరులతో పేచీలున్నాయి. వీధిలో కొన్ని గొడవలూ, కేసులు వున్నాయి. సుబ్బరామ రెడ్డి గారి హత్య తర్వాత, ఆ కుటుంబం పై వున్న అభిమానంతో విఆర్‌సి సెంటర్‌లో, తన వీధి మొగుదాలే శిబిరం ప్రారంభించాడు.

కొరవ 7 పేజీలో

## మాగుంట హత్య

ఆఖరు పేజీ తరువాయి

కాల్పులు జరిగిన కొద్ది సేపటి తర్వాత కొందరు యూత్ కాంగ్రెస్ పిల్ల కాయలు వన్ను, సుబ్బరామ రెడ్డి గారిని చేతుల మీదుగా ఎత్తుకొని కారులో చేర్చి, ఆస్పత్రికి తీసుక వెళ్లారు.

ఇదీ పెంచలు రెడ్డి చెప్తున్న కథనం. దీని ప్రకారం చూస్తే కిడ్నాపకు ప్రయత్నం జరిగిన సూచనలే కన్పించడం లేదు. నక్సలైట్లు మాత్రం పదే పదే తాము కిడ్నాపకు ప్రయత్నించామని, గనమ్యాన్ తొందర పాటు వల్ల హత్యకు దారి తీసిందని చెప్తున్నారు. ఇందులో ఏది నిజమో, ఏది అబద్ధమో తేల్చ వలసింది పోలీసులు. కాని వారికంత శ్రద్ధ వున్నట్లు కన్పించడం లేదు. వుంది వుంటే వారు అత్యంత కీలకమైన పెంచలు రెడ్డి సాక్ష్యాన్ని రికార్డు చేసి వుండాలి. కాని ఇప్పటి వరకు వారు పెంచలు రెడ్డిని కలవలేదు; ప్రాథమిక సమాచార సేకరణకైనా మాట్లాడ లేదు.

హత్య జరిగిన సమయంలో తను కట్టుకొని వుండిన నల్ల పంచ, చొక్కాలను పెంచలు రెడ్డి భద్రం చేసి వున్నారు. అవి రక్త సిక్తమై వున్నాయి. బుల్లెట్ దూరిన రంధ్రం రెండింటి మీదా వుంది. వాటిని పోలీసులు స్వాధీనం చేసుకోలేదు. పెంచలు రెడ్డి ఎడమ తొడ నుంచి నక్సలైట్లు పేల్చిన తూటాను డాక్టర్లు ఆపరేషన్ చేసి తొలగించారు. పోలీసులు దాన్ని పట్టించు కోలేదు. ఎందువల్ల వారింత నిర్లక్ష్యంగా వ్యవహ రిస్తున్నారు? వారి వుద్దేశ్య మేమిటి? మొత్తం రాష్ట్ర మంతటిలోనూ సంచలనం రేకెత్తించిన ఈ హత్య విషయంలోనే వారు అంత ఉదాసీనంగా వ్యవహరిస్తే, ఒక సాధారణ కేసులలో వారి దర్యాప్తు ఎంత మాత్రం వుంటుందో వూహించ గలమా?

పెంచలు రెడ్డి ఒక రకంగా అదృష్ట వంతుడు. బుల్లెట్ అతడి ఎడమ పొత్తి కడుపులో చొరబడింది. అది ఇట్నే లోపలకు వెళ్లి వుంటే ప్రాణాలకు గ్యారంటీ లేదు. కాని ఆ బుల్లెట్ పొత్తి కడుపు దగ్గర కండను చీల్చి, తన ఇట్నే లోపలకు వెళ్లకుండా దిశ మార్చుకొని, దిగువకు తిరిగి, తొడలో దూరి, చర్మానికి రెండు అంగుళాల లోపల కండను చీల్చుకొంటూ ప్రయాణించి తొమ్మి దంగుళాల దూరం వెళ్లి, కండకు, చర్మానికి మధ్య వుండే కొవ్వులో చిల్చి పోయింది. అందువల్ల ఎముకకు కాని, రక్త నాళాలకు కాని, కిడ్నీలకు కాని మరే కీలక శరీర భాగాన్ని కాని నష్ట పరచలేదు. పెంచలు రెడ్డిది గట్టి ప్రాణం. ఆయనను దేవుడే కాపాడి నట్లున్నాడు. డాక్టర్లు తొలగించిన ఆ బుల్లెట్ 50 గ్రాముల బరువు వుంది; దాని పై "మేడ్ ఇన్ యుఎస్ఎ" అనే గుర్తు వుంది. అది గణేశ్ నుంచి పోలీసులు స్వాధీనం చేసుకొన్న రివాల్వరుకు సంబంధించినదో లేక ఇతర హంతకులదో తెలియదు. దీనికి సమాధానం పోలీసులే చెప్పాలి.

హత్య పై దర్యాప్తును సిబిఐకి అప్పగించ డానికి తమకేమీ అభ్యంతరం లేదని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ముఖ్య మంత్రి సమ్మతించారు. అయితే కేంద్రం నుంచి అప్పటి వరకు ప్రతిస్పందన లేదు. సిబిసిఐడి అధికారులు మాత్రం తమ పని తాము చేసుకొంటున్నారు. త్వరలోనే వారు తమకు దొరికిన హంతకులను కోర్టుకు హాజరు పరచి, ఛార్జిషీటు దాఖలు చేయాలనే వుద్దేశ్యంలో వున్నారట. ఈ హత్య నక్సలైట్లు చేసింది కాదని, ఇందులో రాజకీయ ప్రమేయం వున్నదని సందేహిస్తూ జనం మాట్లాడు తున్నప్పుడు పోలీసులు ఆ కోణం నుంచి దర్యాప్తు చేయకుండా నేరుగా ఛార్జిషీటు దాఖలు చేయడం తొందర పాటు కాదా? లేక వారు తమ దర్యాప్తును సమగ్రంగా జరిపి, హత్యకు కారణాలను, హంతకులను నిర్ధారించుకొని, ఆ సమాచారం గోప్యంగా వుంచు తున్నారా? ఏమో!

సుబ్బరామ రెడ్డి గారి హత్యకు సంబంధించి ఈ వారం అందిన సమాచారం ఇదీ!

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

విజేతలకు బహుమతులు పంచారు. అద్దంకి సుబ్రహ్మణ్యం మిమిక్రి, నెల్లూరు రాజేంద్ర కుమార్ మూకాభినయం, ఎన్.ఆర్. కరెంట్ సాంస్కృతిక కార్యక్రమాలు ఈ సందర్భంగా ఏర్పాటయ్యాయి.

## సణుగుడు

4 పేజీ తరువాయి

ఏ పని చేయాలన్నా డబ్బు కావాలి; అది చిల్లి కాణీ లేదు. పదవు లివ్వలేదు, పనులు చేయలేదు, పైసలు సమకూర్చ లేదు, కరెంట్ దీపం వెలిగించ లేదు; ఏమీ చేయకుండా వుంటే ఇంత నువ్వున్న దెందుకంటారని వూర్ల మీద, వీధుల మీద పడుతున్నాడు. ఇక్కడికెందు కొచ్చావని అడిగితే, సమాధానం చెప్పుకోవడానికి ప్రజల వద్దకు పాలనని కొంత కాలం, శ్రమదానమని ఇంకొంత కాలం...! ఎంత దంగడ మారిన పని ఈ శ్రమదానం? స్కూలు పిల్లలతో, కాలేజి విద్యార్థులతో పనులు జరిపించడానికి ప్రయత్నించ డమంటే, సాంఘికంగా వారిలో శ్రమ విలువ గుర్తింపు కలుగ జేయడానికి; సామాజిక స్థితి గతులను మరింత సన్నిహితంగా పరిశీలించే అవకాశం ఇవ్వడానికి పనికి వస్తుంది; వారి చేత వీధులు చిమ్మించడమో, కాలువలు శుభ్రం చేయించడమో, తోటల పెంపకం చేపట్టడమో అందుకు సబబైన కార్యక్రమం. అంతే తప్ప వారి చేత గోడలు, కల్వర్టులు కట్టించి చూస్తే ఏమి జరుగు తుంది? బేల్దారులు, కార్పెంటర్లు చేయ వలసిన పనులు పిల్లల చేత చేయించి డబ్బు దండగ చేయడం దేనికి?

శ్రమదానం వుద్దేశ్యం - ప్రజల సహకారం తీసుకోవడం. గతంలో గ్రామీణ క్రాంతి పథం వంటి కార్యక్రమాలు ఈ కోణం నుంచి బాగా అమలు జరిగాయి; మంచి ఫలితాలూ వచ్చాయి. చీప్ పాపులారిటీ కోసం అసలే బొక్కలు పడివున్న బొక్కసాన్ని మరింత నష్ట పరచడం అన్యాయం. ముఖ్య మంత్రి చెప్తే చెప్పాడు - స్థానికాధి కారులైనా ఈ నిధుల దుబారా ఆపి, వుండే నిధులు వుపయోగ పడే రీతిలో కార్యక్రమాలు చేపట్ట కూడదా?

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

26 తేది వేకువన 3.30 గంటల ప్రాంతంలో శిబిరంలో అందరూ నిద్రలో వున్నప్పుడు ముగ్గురు హంతకులు ముఖానికి గుడ్డలు కట్టుకొని లోపలకు వచ్చి, నిద్రలో వుండిన నాగార్జున మెడ పై గొడ్డలితో నరికారు. ఏమి జరుగు తున్నదీ తెలుసుకొనే లోగానే అతడి ప్రాణం పోయింది. అప్పటికీ కసి తీరక కత్తులతో మరిన్ని పోట్లు పొడిచి, శిబిరంలో వుండే ఇతరులు అర్థం రాకుండా బెదిరించి, ఆ కత్తులు గొడ్డళ్లు వి.ఆర్ కాలేజి గ్రౌండ్‌లోకి విసిరేసి వెళ్లి పోయారట. పోలీసులు వెంటనే స్పందించి ఆరా తీసి, నాగార్జునకు వరుసకు సోదరుడైన భుజంగ రావును, బాబు, శ్రీను అనే మరిద్దరినీ అరెస్ట్ చేశారు. నాలుగు తగిలించే సరికి తామే హంతకులమని ఒప్పుకున్నారట. దీక్షా శిబిరం కాబట్టి, హత్యా నేరం వేరే ప్రక్కకు మళ్లుతుందని భావించి నట్లున్నారు వారు. పోలీసు మెరుకవతో వెంటనే నిజం బయట పడి, దొరికి పోయారు.

శ్రీ మాగుంట సుధాకర రెడ్డి గారు నాగార్జున ఇంటికి వెళ్లి సంతాపం ప్రకటించి వచ్చారు. అతడి కుటుంబానికి ఆర్థిక సహాయం చేసేందుకు యత్నిస్తున్నారు.

ధిక్కరిస్తే డిపాజిట్లు తప్పదని బెదరించాడట. అప్పటికొట్లో వద్దక పోయినా ఆ తర్వాత ఆయన అనుచరులు పది మంది వరకు గుంపుగా ఆఫీసుకు వెళ్లి మళ్లీ ఎండిని తిట్టారట. పాపమా అధికారి భయపడి పోయి వున్నాడు.

ప్రభుత్వ బిల్లులు బాకీ పడితే కట్టమని అడగడం అధికారుల బాధ్యత. అందుకు వారి పై దౌర్జన్యం చేయడం సంస్కార మన్పించు కోదు.

సుందర రామరెడ్డి గారూ - మీరు సాత్వికులు, సంస్కార వంతులు; మీ పేరుతో జరిగే దౌర్జన్యాలు మీరే నివారించాలి. లేకుంటే ఆ నష్టం చివరికి మీకే!

### ప్రసన్న దీక్ష

మాజీ మంత్రి, ఎన్టీఆర్ తెలుగు నాయకుడు శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి 26 తేది కోవూరు ఎమ్మార్వో కార్యాలయం ముందు ఒక రోజు నిరసన దీక్ష చేశారు. సోమశిల నీళ్ల పంపకం, కనిగిరి చెరువు ఆయకట్టు సంరక్షణ కోర్కెలు.

### ఆత్మకూరు విద్యుత్‌బాకీలు- మండలాధ్యక్షుడి దౌర్జన్యం!

ఏళ్ల తరబడి బాకీ వున్న విద్యుత్ బిల్లులు చెల్లించమని అడిగిన నేరానికి ఆత్మకూరు విద్యుత్ సంస్థ - రికో ఎం.డి. పై దౌర్జన్యం చేసి కొట్ట బోయారట - మండ లాధ్యక్షుడు డాక్టర్ బి. రవీంద్ర నాథరెడ్డి.

విద్యుత్ సంస్థ రికోకు ఆత్మకూరు టౌన్‌లోని చాలా మంది ప్రముఖులు బిల్లులు కట్టకుండా కాలక్షేపం చేస్తున్నారు. సంవత్సరాల తరబడి జరిగి పోతున్నదిది. రెండు వారాల క్రితం జమీన్‌రైతులో దీని పై వార్త వచ్చింది. ఆ తర్వాత రికో ఎం.డి. శ్రీ సుందర రామరెడ్డి అందరికీ నోటీసులు పంపాడట. పెద్ద వాడనే గౌరవంతో మాజీ ఎమ్మెల్యే డాక్టర్ బి. సుందర రామరెడ్డి గారి ఇంటికి వెళ్లి వ్యక్తి గతంగా విజ్ఞప్తి చేశాడట. వారి బాకీ లక్షా 15 వేలు. సుందర రామరెడ్డి గారు అదే మర్యాదతో, త్వరలో బిల్లులు కట్టిస్తామని చెప్పి పంపి నట్లున్నారు.

అయితే ఆయన కుమారుడు, మండ లాధ్యక్షుడు డాక్టర్ రవీంద్ర నాథరెడ్డి ఆ ఎండిని తమ వాకిట్లోనే నిలవేసి, అన్నేసి ఏళ్లకు ఒకేసారి బిల్లులు ఇస్తే కట్టేదెట్లా అని అడిగాడట. అక్కడ ఇద్దరి మధ్య వాగ్వివాదం జరిగి నట్లుంది. మండలాధ్యక్షుడు రెచ్చిపోయి ఎండి పై చేయి చేసుకో బోయాడట. తమను

## జనవాణి

3 పేజీ కొరవ

త్వరిత గతిన చేసినందుకు కృతజ్ఞతలు. జిల్లాలోని ఇతర బ్యాంకుల వారు కూడా వెంటనే అరియర్స్ కోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్న తమ పెన్షనర్ల ఖాతాలలో డి.ఎ.ను జమ చేసి, వారికి చేయూత ఇవ్వవలసిందిగా కోరుచున్నాము.

నెల్లూరు -పి. కృష్ణారావు
రిటైర్డ్ డి.ఆర్.ఒ

### ప్రజల వద్దకు పాలనకు ఎందుకీ దండగ ఖర్చు!

గ్రామాల్లోని సమస్యలు పరిష్కరించను ప్రజల వద్దకు పాలన కార్యక్రమం చేపట్టినట్లు ముఖ్యమంత్రి ఘనంగా చెప్పు కొంటున్నారు. అదే ఆశతో ఈ నెల 15 తేది కోవూరు మండలం వెర్లోపాళెం గ్రామానికి వచ్చిన నోడల్ అధికారి, ఇతర శాఖాధి కారుల దృష్టికి మా గ్రామం ఎదుర్కొంటున్న ప్రధానమైన సమస్యలు తీసుకు వెళ్లాను. కాని వారు చెప్పిన సమాధానాలు విని నోట మాట రాక ఈ కార్యక్రమానికి హాజరైనందుకు చెంపలు వేసుకొంటూ తిరిగి వచ్చాను. నేను ప్రస్తావించిన సమస్యలలో మొదటిది - మా గ్రామానికి వచ్చే రోడ్డుకు ఇరు ప్రక్కలా పెరిగి వున్న ముళ్ల కంపలు ప్రయాణానికి అననుకూలంగా వున్నాయని; కాని తాము వాటిని తొలగించ లేమన్నారు. గ్రామస్తుల సమస్య కాబట్టి మీరే పరిష్కరించు కోవాలని నోడల్ అధికారి సమాధానం చెప్పారు. గ్రామంలోని రోడ్లకు నిధుల మంజూరు విషయమై జవహర్ రోజ్‌గార్ నిధులతో సంవత్సరానికి ఒక రోడ్డు చొప్పున నిదానంగా ఆ పనులు చేసుకోమని సలహా ఇచ్చారు. గ్రామాల్లో కరెంటు కొన్ని గంటలు కూడా లేని విషయాన్ని ముఖ్య మంత్రికి ఫోను చేసి తెలుసు కోమన్నారు. ఆర్టీసీ బస్సుల విషయం ప్రస్తావిస్తే తగినన్ని బస్సులు వచ్చినప్పుడు ఆలోచిస్తా మన్నారు. మా గ్రామంలో నోడల్ అధికారి మహానుభావుడు అక్కడి కక్కడే తీర్చిన సమస్య ఒక్కటీ లేదు. మరి సదస్సుల పేరిట ఎందుకీ అనవసర ఖర్చు? కాలం వృధా ఎందుకు?

వెర్లోపాళెం -పి. నిరంజన్

### పోస్టల్ శాఖ తీరు మారదా?

ఆ మధ్య సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి దేశంలో ఉత్తరాల బట్వాడా విషయమై ఢిల్లీలోని పోస్ట్ మాస్టర్ జనరల్‌ను కోర్టుకు పిలిపించి సంజాయిషీ అడిగారు. దేశంలోని ఒక ప్రాంతంలో పోస్ట్ చేసిన ఉత్తరం గమ్యం చేరేందుకు జరుగుతున్న జాప్యాన్ని ప్రశ్నించా రాయన. అయినా పోస్టల్ క్రింది స్థాయి అధికారుల్లో ఈ విషయమై కాసింత చైతన్యం కూడా వచ్చినట్లు లేదు. ఎప్పటి లానే తమ ధోరణిలో సాగి పోతున్నారు. జమీన్‌రైతు పత్రిక కూడా పోస్టల్ పుణ్యమా అని ఒక వారం రావడం మానేసి ఒకేసారి రెండు వారాల పత్రికలు చేరడం జరుగుతున్నది. ఈ సమస్యకు పరిష్కారం దొరకదా?

మద్రాను -వి. రమణయ్య

### ఉపాధ్యాయులకు కరువుభత్యం ఇవ్వాలి!

రెండు నెలల క్రితం అడగక ముందే ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా కరువు భత్యం పెంచారు. కాని రెండు నెలలు అయినా అవి విడుదల కాలేదు. ఈ విషయమై డిశంబరు 15 తేదిలోగా జి.వో. విడుదల చేయకుంటే ప్రత్యక్ష కార్యాచరణకు దిగుతామని ఆంధ్ర ప్రదేశ్ ఎన్.జి.వో.ల సంఘం ప్రకటించింది. 10 రోజుల క్రిందట డిశంబర్ నెలలో డి.ఎ. ఇస్తున్నట్లు జి.వో. విడుదల చేశారు. కాని ఇందులో ఒక మెలిక పెట్టారు. ప్రభుత్వ గ్రాంట్ ఇన్ ఎయిడ్‌తో నడిచే ప్రభుత్వ కళాశాలల్లో వివిధ విశ్వ విద్యాలయాల్లో పనిచేసే అధ్యాపకులకు కరువు భత్యం మంజూరు చేయలేదు. హై స్కూళ్లలో పనిచేసే టీచర్లకు, నాన్ టీచింగ్ సిబ్బందిని కలుపు కొంటే కొన్ని లక్షల మందికి కరువు భత్యం రాదు. పెరుగుతున్న ధరలతో సమానంగా డి.ఎ. మాత్రం ఇచ్చి సరిపెట్టు కొంటారట. కాని ఈ చర్య అన్యాయం. ముఖ్యమంత్రి ఈ విషయంలో పునరా లోచించాలి.

నెల్లూరు -జి. పోలిరెడ్డి

### పల్లెటూళ్లు ఇక వెలుగును చూడలేవా?

పల్లెటూళ్లలో కరెంటు కోతను వర్ణించను మాటలు చాలవు. ముఖ్య మంత్రి చంద్రబాబు నా ..డు గారేమో ఘనంగా సాయంత్రం 5 గంటల నుంచి రాత్రి 11 గంటల మధ్య కరెంట్ కోత వుండదని ప్రకటించారు. కానీ కోత వేళలు అసలు పాటించ కుండా గ్రామాల్లో కరెంటును ఇష్టాను సారం తీసి వేస్తున్నారు. మా గ్రామంలో గత పది రోజులుగా కేవలం రోజుకు 5 గంటల పాటు కరెంటు వుంటున్నది. అది ఇచ్చితంగా ఏ సమయంలో వుంటుందో చెప్పలేని స్థితి. మోటార్లను నమ్ముకొని వ్యవసాయం చేద్దామన్నా రైతుల పరిస్థితి అగమ్య గోచరంగా వుంది. పూర్వ కాలపు గుడ్డి దీపాలు మళ్లీ ప్రత్యక్ష మవుతున్నాయి. రాబోయే కాలంలో పల్లెటూళ్లలో వెలుగును చూడడం కష్టమయ్యేట్లుంది.

కొత్తపల్లి -జి. ప్రకాశరావు

### నక్సలిజం దారితప్పింది

తుపాకి గొట్టం ద్వారా విప్లవం అనే మావో సిద్ధాంతం ఆధారంగా పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని నక్సల్ బరీ గ్రామంలో పుట్టిన నక్సలిజం ఉద్యమం ప్రస్తుతం ఆ రాష్ట్రంలోనే నామ రూపాలు లేకుండా పోయింది. ఆంధ్ర ప్రదేశ్‌లోని తెలంగాణా జిల్లాలలో కొండపల్లి సీతారామయ్య నేతృత్వంలో సిద్ధాంత పరంగా కొన్నాళ్లు సాగిన వుద్యమం కాలక్రమేణా తన దారి తప్పింది. ప్రస్తుతం క్రమ శిక్షణ లేని సిద్ధాంత నిబద్ధత లేని, సిద్ధాంతం అర్థం కాని హింసోన్మాద మిలిటెంట్ల గుంపుతో తన స్థాయి దిగజార్చుకొని ముందుకు సాగుతున్నది. గతంలో కాకతీయ ఎక్స్‌ప్రెస్‌లోని బోగీలలో తలుపులన్నీ మూసి వేసి పెట్రోల్ పోసి మనుష్యులను తగులబెట్టిన సంఘటన ఈ వుద్యమంలో పని చేసే వ్యక్తుల రాక్షస హృదయాన్ని తేటతెల్లం చేసింది. గతంలో పేదల కోసం పాటు పడిన పయ్యావ్రిహావారిని, ప్రస్తుతం మానవతకు మరో పేరైన ఒంగోలు ఎమ్మెల్యే మాగుంట సుబ్బరామ రెడ్డిని పొట్టు పెట్టడం ద్వారా వారు ఘోర తప్పిదం చేసారు. సుబ్బరామ రెడ్డిని కిడ్నాప్ చేసేందుకు మాత్రమే తాము ప్రయత్నించినట్లు ఆ పార్టీ నాయకులు వల్లిస్తున్న బూటకపు మాటల్లో విశ్వసనీయత ఏ మాత్ర ముందో అందరూ అర్థం చేసు కొంటున్నారు. పూర్వం కమ్యూనిజం గుప్పిటనున్న రష్యా, పోలెండ్, చెకొస్లోవేకియా, యుగోస్లావియా, తూర్పు జర్మనీ దేశాల్లో కమ్యూనిజం రూపు మాసిపోయింది. అక్కడి ప్రజలు అన్నమో రామచంద్ర అని అల్లాడు తున్నారు. చైనాలో నిజమైన కమ్యూనిజం ఇసుమంతైనా కనిపించడం లేదు. దీనికి కారణ మేమిటో విప్లవ వాదులు ఆలోచించాలి. భారత దేశం వంటి ప్రజాస్వామ్య దేశంలో నగటు మనుషులకు హింస నచ్చదు. అది తెలిసీ ఆ బాటనే సాగుతున్న నక్సల్ సోదరులు తమ సిద్ధాంతాలను పునర్విమర్శ చేసుకొని దారి మార్చుకోమని సలహా.

మద్రాస్ -డాక్టర్ వై. కృష్ణమోహన్‌రెడ్డి
అసిస్టెంట్ ప్రొఫెసర్

### సుబ్బరామరెడ్డి వారసుడు శ్రీనివాసులురెడ్డి!

మాగుంట సుబ్బరామ రెడ్డి ఆత్మ బలి దాన రక్తంతో కీర్తి జ్యోతిని వెలిగించిన ఒంగోలు ఎమ్మెల్యే స్థానానికి రానున్న ఎన్నికలలో సుబ్బరామయ్య తమ్ముడు శ్రీనివాసులు రెడ్డిని అభ్యర్థిగా చేయడం సముచిత మర్యాద అని భావిస్తున్నాను. శ్రీనివాసులు రెడ్డి అమితోత్సాహి, కార్యాచరణదక్షుడు; ప్రస్తుతం మాగుంట వాణిజ్య సామ్రాజ్య పాలనలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. ఆయనను అభ్యర్థిగా ఎంపిక చేస్తే సుబ్బరామయ్య నిజ జీవిత సమర్పణకు శోక సాగరాన్ని లేవనెత్తిన అసంఖ్యాక జనం పరవసించి పోగలరు.

నెల్లూరు -మరుపూరుకోదండరామిరెడ్డి

## శుభాకాంక్షలతో

జయంపుష్ప

మేమంతా
ఇప్పటికి ఇక్కడ క్షేమం
మీరెలా వుందక్కడ హోమం?
శ్రీలంకలో
సింహాల పులుల కొట్లాట
రష్యాలో చెచెన్యా కొట్లాట
ఆఫ్ఘనిస్తాన్‌లో అంతర్యుద్ధం
బెంగాల్లో పగిలిన అద్దం
పాకిస్తాన్‌లో మంతత్వమం
హిందుస్థాన్‌లో హింసోన్మాదం
ఓషినిక్యో గ్యాసుల దాడి
అమెరికాలో స్కిన్‌హెడ్స్‌వేడి
చరారే షరీఫ్ దర్గాదహనం
నైనాసాహ్ని మాడ్చిన వైనం
ఓస్ట్రోతలను నరకిన చిత్రం
ఇజ్రాయెల్‌రాబిన్ విడిచిన ప్రాణం
నైజీరియా కెన్‌సారోవివాదం
పంజాబ్ బియాంత్ కారు ప్రమాదం
బీజింగ్ స్త్రీల సదస్సు నినాదం
ఎంపీ మాగుంట మరణోదంతం
మండిడాబ్వాలి మంటల్లో పిల్లలు
ఉరులియాలో తుపాకి జల్లులు
* * *
ప్రేమకు మమతకు మనిషె దూరం
నలువైపుల సమాచార ప్రవాహం
ఊపిరాడని ఉద్వేగ జీవితం
వాస్తవాన్ని మరుస్తున్న జీవనం
సహజత్వానికి దూరం దూరం
బతుకు పరుగులో వారం వారం
* * *
కొత్త సంవత్సరం వచ్చింది
కోటి ఆశలు తీసుకొచ్చింది
ఎటు చూసినా కోయిల రావం
స్వచ్ఛమైన చిరునవ్వుల మయం
స్నేహ హస్తాలు, సరసనేస్తాలు'
కలలునిజం చేసే నిజమస్తకాలు
అవాజ్య ప్రేమను ఆహ్వానిద్దాం
అనంత ఆనందాన్ని ఆస్వాదిద్దాం
ఇకనైనా తీరాలి మన వాంఛలు
అందుకే అందరికీ శుభాకాంక్షలు

## పంచాంగం

తేది 31 ఆదివారం గురుమౌఢ్యమి పూర్తి అగును

### ముక్కోటి

తేది 1 సోమవారం ఆంగ్ల సంవత్సరాది మరియు ముక్కోటి ఏకాదశి

### డిసెంబరు తిథులు

పుష్య శుద్ధ
తే 30శని నవమి సా.గ. 5.27 వ
తే 31ఆది దశమి సా.గ. 5.35 వ
1996 జనవరి తిథులు
తే 1 సోమ ఏకాదశి రా.గ. 6.20 వ
తే 2 మంగళద్వాదశి రా.గ. 7.30 వ
తే 3 బుధత్రయోదశి రా.గ. 9.10 వ
తే 4 గురుచతుర్దశి రా.గ. 11.10 వ
తే 5 శుక్ర పూర్ణిమ రా.గ. 1.10 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

## అశ్రుతర్పణం



ప్రేమానురాగ సౌజన్య కాంత స్వరూపిణి
సదా దైవచింతన పరురాలు, సర్వుల శ్రేయోభిలాషి
మా ఇంటి అన్నపూర్ణ

### శ్రీమతి నాగారెడ్డి శకుంతలమ్మ

22.12.95 తేది శుక్రవారం రాత్రి అశేష బంధుమిత్రులను శోక సాగరంలో వదలి పరమ పదించినారు. అశ్రుత నయనాలతో శ్రద్ధాంజలి ఘటిస్తూ తీమె పవిత్రాత్మకు శాంతి చేకూర్చాలని భగవంతుని ప్రార్థించు చున్నాము.

### ఉత్తరక్రియలు

3.1.96 తేది బుధవారం రాత్రి శిలాప్రతిష్ట
4.1.96 తేది గురువారం ఎత్తురేవు, బ్రాహ్మణ బియ్యాలు
మాచర్లవారిపాళెంలో జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుతాము.

భర్త - నాగారెడ్డి హరిశ్చంద్రారెడ్డి
కుమారులు - కోడళ్లు
నాగారెడ్డి వెంకట సుబ్బారెడ్డి - ప్రమీలమ్మ
నాగారెడ్డి నరేంద్రరెడ్డి - శ్రీలత
నాగారెడ్డి కోదండరామిరెడ్డి
మనుమడు - వి.ఎస్. కుమార్, మనుమరాళ్లు - గాయిత్రి, సాయి స్రవంతి



శ్రీ కృష్ణార్జున విజయంలో బాలకృష్ణ, రేణుక, ఉజ్వల

# విజయశాంతి పెండ్లి కలవరం!

డిసెంబర్ 14 "కుముదం" తమిళ పత్రికలో విజయ శాంతికి రిజిష్టర్ మేరేజ్ జరిగినపుడు రిజిష్ట్రార్ ఇచ్చిన సర్టిఫికెట్ కాపీ ప్రచురింప బడింది. ఆ విషయం సినిమా రంగంలోని వారికి ఇది

## ఏడేళ్లనాడు జరిగిన పెళ్ళిని ఇంకా ఎందుకు గోప్యంగావుంచడం?

వరకే తెలిసినా తమిళ ప్రేక్షకులలో ఎంతో సంచలనం కలిగించింది. ఆ విషయం గురించి మాట్లాడడానికి ఆ పత్రికా విలేఖరి సునీల్ ఒక మలయాళ చిత్రం షూటింగ్‌లో ఉన్న ఆమెను కలిశాడు. "నేనొక విషయం అడుగుతాను మీరేం కోప్పడరు కదా? మీరు విరుగంబాక్కం రిజిష్ట్రార్ ఆఫీసులో వివాహం చేసు కున్నారట కదా!" అని అడిగాడు "నో" అంటూ విజయ శాంతి ఆగ్రహం ప్రదర్శించింది. "ఎవడో ఇడియట్ పుట్టించిన పుకారిది. దాన్ని గురించి నన్ను అడుగు తారేమిటి?" అంది "శాంతించండి మేడమ్" అంటూ ఆ సర్టిఫికెట్ నకలు ప్రచురించ బడిన కుముదం పత్రిక కాపీని చూపించాడు. అది చూసి విజయ శాంతి ముఖంలో రంగులు మారాయి. "దీన్ని బట్టి రుజువవు తోంది కదా! నిజమే ఏడేళ్ళు అయింది వివాహమై; ఇది నా అంత రంగిక విషయం. నేను ఎవరితోనూ చెప్పు కోవలసిన అవసరం లేదు. ఇంత కాలం తర్వాత ఇప్పుడు మీ పత్రికలో ఆ విషయాన్ని ఆధార పూర్వకంగా ప్రచురించడంలో మీ ఉద్దేశ్య మేమిటి? అంది. "శ్రీనివాస్ ప్రసాద్ గారూ, మీరు అన్యోన్యంగా ఉన్నారా?" అడిగాడు సునీల్. "ఇది మరొక వదంతి అన్యోన్యంగానే వున్నాం. ఇంతకీ మేమెలా పోతే మీకేం? ఇక ఈ విషయానికి ఇంతటితో పుల్‌స్టాప్ వేయండి" అంది విజయ శాంతి. "పోనీ ఆయన ఫోటో ఒకటి ఇస్తారా?" అడిగాడు సునీల్. "ఎందుకు? ప్రచురిస్తే ఆయనకు ఏదైనా ప్రమాదం ఏర్పడ వచ్చు. ఈ సబ్జెక్టుకు పుల్‌స్టాప్ పెట్టేయ మన్నాగా" అంది విజయ శాంతి. సునీల్ బలంగా బదులు మాట్లాడ లేక, అక్కడ్నుంచి నీరసంగా బయలు దేరాడు.

### ప్రభుదేవా కర పత్రాలు

ఎ.వి.ఎం. స్టూడియోలో ప్రభుదేవా కనిపించి "నమస్కారం స్వామీ" అన్నాడు; "నా పేరు స్వామి కాదే?" అన్నాను. నేను అయ్యప్ప మాల వేసుకున్నాను స్వామీ మా గురుస్వామి నంబియార్ గారు ఒక విషయంలో చాలా బాధ పడుతుంటారు. అయ్యప్ప మొక్కులో ఉన్నవారు నియమ నిష్టలతో ఉన్నా, కొందరు సిగరెట్లు తాగు తుండడం ఆయనకు బాధ కల్గిస్తోంది. అలా సిగరెట్ తాగకూడదని ప్రచారం చేసే బాధ్యత నువ్వు వహించ వచ్చు కదా? అన్నారు. అందుకోసం నేను కర పత్రాలు వేయించాను అంటూ తన అసిస్టెంటు జేబులోంచి ఒక కాగితాన్ని తీసి ఇచ్చాడు. చదివాను, బాగుందని చెప్పాను. "థ్యాంక్స్ స్వామి, మీకు తెలిసిన మిత్రులతో కూడా ఈ విషయాన్ని చెప్పి కాస్త ప్రచారం చేయకూడదా స్వామి" అన్నాడు "అలాగే స్వామీ!" అంటూ సెలవు తీసుకున్నాను.

# జయసుధ చేత రవిక లేని సీను!

తమిళ దర్శకుడు భారతీ రాజా పరిచయం చేసే ప్రతి నటీమణి పేరులో మొదటి అక్షరం 'ఆర్' ఉండేలా మార్పు చేస్తుంటారు. ఉదా: రాధ, రంజిత, రేఖ... అంతే కాదు; తన చిత్రాలలో ఏ తార అయినా రవిక తొడుక్కో కుండా కనిపించాలి. "ముదల్ మరియాదై" చిత్రంలో రాధ "నాడోడి తెన్రల్" చిత్రంలో రంజిత ఇలానే నటించారు. ఇటీవల ఆయన తీస్తున్న చిత్రంలో జయసుధ నాయిక. ఆమె కూడా ఒక సీన్‌లో రవిక లేకుండా కనిపిస్తుందని చెప్పగానే ఎంతైనా ఆశ్చర్యం కలిగింది "అదేమిటండీ జయసుధది పెద్ద వయస్సు కదా?" అంటే "అవును ఈ చిత్రంలోనూ వృద్ధనారీ వేషమే. కాని, ఎక్కడైనా నేను యంగ్ గెటప్‌లో కాస్సేపైనా కనిపిస్తే బాగుంటుందని ఆమే చెప్పింది. ఐతే, ఫ్లాష్ బ్యాక్ సీన్ కొత్తగా పెడ్తాను మీరు రవిక లేకుండా కనిపించాలి" అన్నాను ఆమె సరేనంది. అంతే" అన్నాడు భారతీ రాజా నవ్వుతూ.

### "పెళ్ళి సందడి" జనవరి 12న విడుదల

బెంగుళూరు, శివ సముద్రం ప్రాంతాలలో పాటలు చిత్రీకరించాము అన్నారు కె. రాఘవేంద్ర రావు. ఈయన దర్శకత్వం వహించే పై చిత్రంలో శ్రీకాంత్, రవళి, దీప్తి భట్నాగర్, సత్య నారాయణ, బ్రహ్మానందం, ఎ.వి.ఎ... బాబూ మోహన్, తనికెళ్ళ భరణి, శి... రాజా, రజిత, శ్రీలక్ష్మి పాత్ర ధారు... మాటలు: సత్యానంద్, సంగీ... కీరవాణి, డైరెక్టర్ గారే నృత్య దర్శకత్... వహించడం ఈ చిత్రంలో ఆకర్... జనవరి 12న విడుదల చేస్తున్నా... అన్నారు ఎగ్జిక్యూటివ్ నిర్మాత కె... బాబు.

### వృద్ధ నారికి యంగ్ గెటప్

### "అక్కుమ్ - బక్కుమ్" కృష్ణ గెస్ట్ పాత్ర

తీసేది చిన్న తారలతో చి... బడ్జెట్ సినిమా అయినా హీరో కృ... గెస్టుగా నటిస్తే అది పెద్ద చి... మవుతుందని నిర్మాతల అభిప్రాయ... కాబోలు - ఇటీవల కొన్ని చిత్రాల... కృష్ణ స్పెషల్ అప్పియరెన్... ఇచ్చేస్తున్నారు. కోట శ్రీనివాస రా... అప్పుల బాధ పడలేక గుండె పో... పాటుతో ఆస్పత్రిలో చేరుతారు. అతడి... అప్పు ఇవ్వడం కన్నా హీరో కృష్ణ... సినిమా తీస్తే బాగుండేది కదా అని ... అప్పుల వాళ్లు ఊహా లోకాల్లో తేలియా... తారు. ఆ సన్నివేశాలను బెంగుళూరులో... కబ్బన్ పార్క్, మహారాజా ప్యాలెస్...

కొరవ 11 పేజీలో

## చిరంజీవి పాత చిత్రాల్లోని ముక్కలతో సరికొత్త అతుకుల బొంత

# రిక్షావోడు

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

బడా హీరో చిరంజీవి రిక్షావోడు రాజాగాను, జమీందార్ ధర్మా రాయుడు గాను ద్విపాత్రాభి నయం చేశాడు. ధర్మారాయుడు, రాజా తండ్రే! ఈ రెండు పాత్రల్లో ధర్మారాయుడు పాత్రలో చిరంజీవి చాలా హుందాగా నటించాడు. సంభాషణల ఉచ్చారణ, హావభావ ప్రకటనలు గొప్పగా వున్నాయి. చిత్రంలోని అన్ని పాత్రల కంటె జీవమున్నది ఒక్క ధర్మారాయుడు పాత్రలోనే. ధర్మా రాయుడు, ఆయన భార్య పార్వతి ఉన్న దృశ్యాలే చిత్రంలో చూడ తగినవి. భార్య పార్వతిగా జయసుధ వున్న మూడు దృశ్యాలూ చాలా బాగున్నాయి. ఆమె సజీవమైన నటన ప్రదర్శించింది.

రిక్షావోడు రాజా చాలా మామూలు పాత్ర. ఇద్దరు హీరోయిన్లతో కులకటం, చౌకబారు ఫైటింగులు చెయ్యటం, విలన్ ముఠాతో పోరాడటం తోనే కాలం సరిపుచ్చుతుంది. ఫైటింగులు, డ్యూయట్లు ఇవన్నీ ముఖం మొత్తిన విషయాలు. అందువల్ల ఈ పాత్రకు ఏమంత గుర్తింపు వుండదు. అయితే ఇది హీరో పాత్ర. ఈ ...రో పాత్రలో చిరంజీవి అంతగా రా...పుకు రాలేదు. మూస పద్ధతిలో వుండే హీరో పాత్రలు చిరంజీవి ఆర్జించిన స్థాయిలో అతడ్ని వుంచలేవు; స్థాయిని పెంచలేవు. ఉన్నతమైన, ఉత్తమమైన స్థాయిని అలంకరించ గల విశిష్టమైన పాత్రల్లో చిరంజీవి నటించటం మంచిది. ప్రేక్షకులకూ మంచి చిత్రాలు చూసే అవకాశం చిక్కుతుంది.

ఈ చిత్రానికి తోటపల్లి మధు వ్రాసిన కథ పాత కంపు కొడుతూ వుంది. చిరంజీవి హీరోగా నటించిన పలు చిత్రాల్లోని అంశాలు ఏరి, కలిపి, కలగా పు... వేసి, కథగా అల్లారు. హీరో, విల... ద్దరు హీరోయిన్లు, అందులో ...రు హీరోకు భార్య కావటం, మరో ఆమె చనిపోవటం లేక గాలికి ...దిలేయటం ఇవన్నీ చాలా పాత విషయాలు.

పేరున్న దర్శకుడు, ఆదర్శ నిర్మాత అయిన క్రాంతి కుమార్ ఈ చిత్రాన్ని నిర్మించాడు. కొత్త కొత్త ఇతివృత్తాలతో సాంఘిక సంచలనం సృష్టించే చిత్రాలకు దర్శకుడుగా, నిర్మాతగా రాణించిన క్రాంతి కుమార్ ఇంతటి పాత కథను తెరకెక్కిం చేందుకు ఎందుకు పూనుకున్నాడా అనిపిస్తుంది. చేవగల దర్శకుడు కోడి రామకృష్ణ పాత కంపును భరించి ఈ చిత్రాన్ని ఎలా పూర్తి చేశాడా అని ఆశ్చర్యం కలుగుతూ వుంది. ఈ చిత్రంలోని పాత వాసనకు ఆయన సువాసన లేవీ పులమ లేకపోయారు. కోర్టు సీను చాలా చౌకబారుగా చూపబడింది. ఇంటి మీద కెక్కిన కోడిని పట్టుకునే దృశ్యం అనవసరం. ఇదే అనవసరమను కుంటే అక్కడ ఒక పాట. "నీ పెట్ట నా పుంజును ముద్దెట్టు కోని" ఇరికించారు. విలన్ నడిపే రాజకీయాలు నిస్సారంగా వున్నాయి. ఫైటింగులు చప్పగా రూపొందాయి. చిరంజీవి చెయ్యి తగ్గ స్థాయిలో లేవు.

రచయిత మధు తన మేధస్సంతా ఉపయోగించి ద్వంద్వార్థాలతో మాటలు వ్రాశాడు. "నీ మూడు నాకిస్తే నా ఒకటి నీకిస్తా". ఇలా సాగాయి మాటలు. సెన్సార్ వాళ్ళు ఎలా అనుమతించారో! చిత్రంలో వున్న ఆరు పాటల్లో "నగుమోము కనలేని" త్యాగరాయ కీర్తన కోటి సంగీతంలో కమ్మగా వినిపించింది. కోటి సంగీతం ఫర్వాలేదు. కె. దత్ ఫోటోగ్రఫీ బాగుంది.

కొరవ 11 పేజీలో

## ఫైవ్‌స్టార్

2 పేజీ తరువాయి

### ఈస్ట్ ఇండియా

వీరి యాజమాన్యంలో 6 ఫైవ్ స్టార్ హోటళ్లు వున్నాయి. వీటిని ఒబ్రాయ్ హోటళ్లని పిలుస్తారు. మద్రాసులోని ట్రైడెంట్ హోటల్ కూడా వీరిదే. స్వంతవే కాకుండా, ఢిల్లీ, జైపూర్, ఉదయ పూర్, హైదరాబాదు నగరాలలో వీరి నిర్వహణలో హోటళ్లున్నాయి. మద్రాసులో మన మాగుంట కుటుంబీకులు నిర్మిస్తున్న ఫైవ్ స్టార్ సూపర్ డీలక్స్ హోటల్‌ను వీరే నిర్వహించ బోతున్నారు. ఈ ఏడాది

అక్టోబరు నాటికి 164 కోట్ల వ్యాపారం చేశారు. గత ఏడాది కంటే 46 శాతం పెరుగు దల సాధించారు. వీరి ఆదాయంలో 57 శాతం వరకు విదేశీ కరెన్సీలో వుండడం విశేషం.

### ఐటిసి హోటళ్లు

వీటిని వెల్‌కం గ్రూప్‌గా వ్యవహరిస్తారు. అయితే ఒక్క బొంబాయిలో మాత్రమే వీరికి కీలకమైన హోటల్ వుంది. తక్కినవన్నీ వాణిజ్య కేంద్రాలలో కాకుండా, విహార యాత్రా స్థలాలలో వుండడం వల్ల వ్యాపారం సీజనల్‌గా వుంటుంది.

### లీలా

వీరిది చాలా ఖరీదైన హోటల్. ఒక్కొక్క గదికి రోజుకు సరాసరిన రు. 5800 లు బాడుగ వసూలు చేస్తున్నారు. బొంబాయి ఎయిర్ పోర్టు సమీపంలోని ఈ హోటల్ ఇంత ఖరీదై నప్పటికీ ఆక్యుపెన్సీ రేటు 95 శాతం వరకు వుండడం విశేషం. ఈ హోటల్‌లో గది దొరకడమే చాలా కష్టం.

వీరే బొంబాయిలో ఇంటర్నేషనల్ కన్వెన్షన్ అండ్ ఎగ్జిబిషన్ సెంటర్ నిర్మిస్తున్నారు. 1100 కోట్ల పెట్టుబడితో రూపొందుతున్న బృహత్తర ప్రాజెక్ట్ ఇది. ఇందులో 700 గదులు వుంటాయి. 7 వేల మంది ఒకేసారి కూర్చొని, వినగల సమావేశ మందిరం నిర్మిస్తున్నారు. రానున్న మూడేళ్లలో ఇది పూర్తవుతుంది.

ఫైవ్‌స్టార్ హోటళ్లలో దీర్ఘ కాలం వుంచుకో గల్గితే, మంచి పేరు ఇది.

## సోనియా

మొదటి పేజీ తరువాయి

పూల గుత్తుల్ని చిరు దరహాసంతో స్వీకరించారు. సాధారణంగా సోనియా గాంధీ ఇటువంటి స్వాగత మర్యాదలకు దూరంగా వుంటారు. ఈ మారు మాత్రం తనకు తెలిసిన కాంగ్రెస్ నాయకుల్ని పేరు పేరునా పలకరించి కుశలం అడిగి తెలుసు కున్నారు.

సోనియా గాంధీ విమానా శ్రయంలో దిగుతుండగానే ఆమెకు రాజ్యసభ సభ్యుడు వి. హనుమంత రావు, పిసిసి అధ్యక్షుడు రోశయ్య ఇతర కాంగ్రెస్ నాయకులు స్వాగతం పలకడంతో రాజకీయ కలకలం మొదలైంది. విమానా శ్రయం నుంచి ఆమె నేరుగా వచ్చి సోమాజీ గూడ చౌరస్తాలో వున్న రాజీవ్ విగ్రహానికి పూల మాల వేశారు. ఆ తర్వాత రాజ్‌భవన్‌లో విడిది చేశారు. రాజ్‌భవన్ సందర్శకులతో కిక్కిరిసి పోవటంతో సోనియా గాంధీని కలవాలను కునే వారి సంఖ్య బాగా పెరిగింది. సోనియా గాంధీ ఇటీవల కర్నాటక, కేరళ, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల్లో పర్యటించి నప్పుడు కూడా ఇదే మాదిరిగా రాజకీయాల పై ఆసక్తి కనబరచారు. అయితే ప్రత్యక్షంగా రాజకీయాల పై చర్చించిన దాఖలాలు లేవు కానీ పార్టీలో ఏమి జరుగు తున్నది? పార్టీ అధినేత పి.వి. పట్ల వస్తున్న ఫిర్యాదుల తీవ్రత ఎలా వుందన్న విషయాల పై ఆమె ఆసక్తి కనబరు స్తున్నట్లు కనిపిస్తోంది.

సోనియాను కలిసిన వారిలో 90 శాతం మంది క్రియాశీలక రాజకీయాల్లోకి రావల్సిందిగా ఆమెను ఆహ్వానించారు. తమ కుటుంబానికి పార్టీలో వున్న పట్టు సడలిందా? ఇంకా బిగిసే వుందా? అన్న విషయమై సోనియా వాకబు చేస్తున్నట్లు అనిపిస్తోంది.

మొత్తం మీద సోనియా గాంధీ రాష్ట్ర పర్యటన కాంగ్రెస్ వర్గాల్లో సంచలనం రేపగా పి.వి.ని వ్యతిరేకిస్తున్న వర్గాల్లో కొత్త ఆశల్ని రేకెత్తించింది. వచ్చే లోక్‌సభ ఎన్నికల్లో సోనియా గాంధీ క్రియాశీలక పాత్ర నిర్వహించే అవకాశ ముందని పలువురు సీనియర్ నాయకులు అంచనా వేస్తున్నారు. అయితే సోనియా అంతరంగం ఏమిటన్నది భవిష్యత్తే నిర్ణయించాలి.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

### ఓరుగంటి మహాలక్షమ్మ గారి అస్తమయం

అనాది దేశ భక్తురున్నూ, సంస్కరణ ప్రియురున్నూ అయిన ఓరుగంటి వెంకట సుబ్బయ్య గారి ధర్మపత్నియున్నూ, సారస్వత ప్రియురు, సుహృదురు, తూములూరు శివ రామయ్య గారి సోదరి యున్నూ, స్వర్గీయ ఓరుగంటి వెంకటేశ్వర్లుని వంటి పుత్రునిగన్న వీర మాతయున్నూ అయిన మహాలక్షమ్మ గారు గత రెండు మూడు సంవత్సరాలుగా మరణ శయ్య పై బాధ అనుభవిస్తుండి 27 రాత్రి 10 గంటలకు దేహ యాత్ర చాలించెను. ఈమె గారు 2 మార్లు కారాగార యాత్రా గూడా సాగించిన దేశ సేవిక. ఈమె గారి మరణానికి, వారి కుటుంబానికి మా సంతాపాన్ని తెలుపు తున్నాము.

### నెల్లూరు ముచ్చట్లు

అవీ - ఇవీ

21 తేది చింత పండు మూటలు వేసు కొన్నుండిన బండి అర్ధమ రేత్రిర్లో ఓజిలి చెరువు కట్ట మీద ట్రంకు రోడ్డులో నుంచి యెద్దులు బిదిరి చెర్లోబడి పోయింది. పొద్దున చూడగా బండి మనిషి చచ్చి మూటల క్రింద అప్పచ్చి మాదిరి అయి పోయి వుండినాడు. అరక్షితమైన యీ రోడ్డు ఎప్పుడైనా ప్రమాదమే.

* * *

ఈ మధ్యా ఒకనాటి రాత్రిరి సూళ్లూరు పేట తెలుగు పండితుని భార్యతో కలకత్తా మెయిల్ నివాద పడింది. అకారణంగా ఆమెకు కాలు, అయ్యోకు పడుపు పోయింది. ఆమె మంచి యిల్లాలట పాపం.

* * *

అల్లూరు బోర్డు లెక్కలు గత ఫసలీలో రెండు వేలు మింగి కూర్చున్నవి నలగట్ల వెంకట సుబ్బారెడ్డి సాక్షిగా విచారణ 9 తేదిన, తన బోర్డు లెక్కల నిర్దుష్టాన్ని ఋజువు పరచ వలసిన బాధ్యత ప్రెసిడెంటు గారి నెత్తిన గూడా వుంటుందని మేమే గాదు సంగీత విద్వాన్ వేమూరు కృష్ణయ్య తమ్ముడు మాత్రం అనడా!

**In the Court of Munsif Magistrate: Pulivendula**

O.S. 255/94

Syndicate Bank Simhadripuram - Plaintiff

Vs

Pandi Kolanu Vijaya babu, - S/o. Lazar, Radio / Tape Recorders Servicing and Sales unit residing at Ravula Kolanu village, Simhadripuram Mandalam, Cuddapah Dt. - Defendent

**NOTICE**

పై బ్యాంకు వారు మీ పై పై కోర్టులో దావా దాఖలా చేసి వున్నారు. సదరు దావాలో మీరు స్వయముగా గాని లేక మీ అడ్వకేట్ గారి ద్వారా గాని 5.2.96 తేదిన వుదయం 10.30 గంటలకు హాజరై మీ అక్షేపణాలు తెల్పుకోవలెను. లేనంతట మీ పరోక్షమందు తీర్మానించ బడునని ఖండితముగా తెల్పడమైనది.

**D. Ranga Reddy**

Advocate for Plaintiff

ఓం శ్రీ సాయిరాం

# శ్రద్ధాంజలి

## మన్నెం లక్ష్మణాత్రేయరెడ్డి గారు



జననం: 28.2.1924

మరణం: 23.12.95

23.12.1995 తేది శనివారం పరమ పదించారు. వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

### పెద్దకర్మ

4.1.1996 తేది గురువారం ప్లాట్ నెం. 120, రోడ్డు నెంబర్ 71, నవనిర్మాణ నగర్, జూబిలి హిల్స్, హైదరాబాదులోని మా స్వగృహాము న జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుతాము.

మన్నెం రాణీ సంయుక్త - భార్య

## ...ల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

మహిళలు ముందుకు రాగా మెటీరియల్ ఖర్చు ప్రభుత్వమే భరిస్తున్నది. అక్కడా కలెక్టర్ పలుగు చేత బట్టి త్రవ్వగా, ఆ ప్రాంత కౌన్సిలర్ కోట లక్ష్మి కుమారి పారతో మట్టిని తీసారు. మునిసిపల్ కమీషనర్ ఆంజనేయులు, ఇంజనీర్ సుధాకర్, ఆరోగ్య శాఖాధి కారి డాక్టర్ సుబ్బారెడ్డి కూడా కలెక్టర్‌ను అనుసరించక తప్పలేదు. మొత్తానికి ఒక మంచి కార్యక్రమానికి శ్రీకారం చుట్టిన గిరిధర్ అభినంద నీయుడు.

### బ్లడ్ బ్యాంకుకు విరాళం!

భారత రెడ్ క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో నెల్లూరులో అత్యాధునికంగా నిర్మించ తలపెట్టిన బ్లడ్ బ్యాంకు పని త్వరిత గతిన చేపట్టేందుకు కమిటీ కార్యదర్శి డాక్టర్ ఎవి సుబ్రహ్మణ్యం అమితంగా శ్రమ పడుతున్నారు. 23 తేది జాయింట్ కలెక్టర్ బంగళాలో ప్రత్యేక కార్యక్రమంలో కలప వ్యాపారస్తుడు దివంగత ఎల్.వి. రమణా రెడ్డి జ్ఞాపకార్థం వారి కుమారుడు ఎల్.వి. నరసా రెడ్డి బ్లడ్ బ్యాంకు నిధికి లక్ష రూపాయల చెక్కును ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్‌కు అంద జేశారు. చిన్న పిల్లల వైద్య నిపుణులు రామకృష్ణా రెడ్డి, జిల్లా రెడ్ క్రాస్ సంస్థ ఉపాధ్యక్షులు జెటిమల్ జైన్ ఇతర కమిటీ సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. రెడ్ క్రాస్ సంస్థ రాష్ట్ర కమిటీ నెల్లూరు బ్లడ్ బ్యాంకుకు 25 వేల రూపాయల విరాళం ప్రకటించింది. నెల్లూరు కమిటీ కార్యదర్శి డాక్టర్ ఎవి సుబ్రహ్మణ్యం, మాజీ కన్వీనర్ సి.హెచ్. జామవాకు గవర్నర్ కృష్ణకాంత్ మెరిట్ సర్టిఫికెట్లు ఇటీవల బహూకరించారు.

### అలరించిన సంగీతోత్సవాలు

ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల, రసిక రంజని గానసభ సంయుక్తంగా టౌన్‌హాల్‌లో ఇటీవల త్యాగరాజ ఆరాధ నోత్సవాలు నిర్వహించాయి. తొలి రోజు ఐలహపురి కామేశ్వర రావు భావ యుక్తంగా త్యాగరాజ కృతులలో నాదశిల్పం అనే అంశం పై మాట్లాడారు. మద్రాసుకు చెందిన వయొలిన్ విద్వాంసులు ఎం. చంద్రశేఖరన్ వయొలిన్ పై త్యాగరాజ కృతులను వినిపింప జేసారు. ప్రముఖ మృదంగ విద్వాంసుడు దండమూడి రామ్మోహన రావు తమ అద్భుత ప్రతిభతో కార్యక్రమాన్ని రక్తి కట్టించారు. మద్రాసు విద్వాంసులు చంద్ర శేఖరన్‌ను సభా నిర్వాహకులు సన్మానించి 'వయొలిన్ వాద్య విద్యా భూషణ' బిరుదును అందించారు. రెండవ రోజు జరిగిన కార్యక్రమంలో సంగీత కళాశాల ప్రిన్సిపల్ కొమండూరి శేషాద్రి త్యాగరాజ సంగీతున్నతిని విస్తృత పరచి, తాళ శిల్పంలో నాదాన్ని సంధానం చేసిన తీరును సోదాహ రణంగా వినిపించారు. దండమూడి రామ్మోహన రావు, ఆయన సతీమణి సుమతి కలసి చేసిన లయ ప్రస్తారం రసతుందిలంగా శ్రోతలను పరవశింప జేసింది. 4 వేల రూపాయల నగదు వస్త్రాలతో దండమూడి దంపతులను సన్మానించి మృదంగ వాద్య సుధామణి బిరుదును ప్రదానం చేసారు. సభకు డాక్టర్ పి. మధు సూదన శాస్త్రి అధ్యక్షత వహించారు.

### లెక్కలలో ప్రావీణ్యత

లెక్కల పరీక్షంటే చాలా మంది విద్యార్థులకు అదో రకమైన భయం పుట్టు కొస్తుంది. కాని సెప్టెంబరులో జరిగిన బి.ఎస్.సి. ఫైనల్ ఇయర్ పరీక్షలలో నెల్లూరు డి.కె. డబ్ల్యు కళాశాల విద్యార్థిని విస్సా పద్మావతి లెక్కల సబ్జెక్టులో 150 మార్కులకు గాను 150 తెచ్చుకొన్నది. ఈ విద్యార్థిని ఎటువంటి ట్యూషన్లూ లేకుండా కాలేజిలోనే పాఠం విని, ఇంటి వద్ద స్వయం కృషి చేసి ఈ విజయం సాధించింది.

### యువజన కాంగ్రెస్ ఆధ్వర్యంలో రాస్తారోకో

విద్యుత్ కోతకు నిరసనగా రాష్ట్ర యువజన కాంగ్రెస్ పిలుపు మేరకు జిల్లా యువజన కాంగ్రెస్ కమిటీ ఆధ్వర్యంలో 23 తేది టౌన్‌లో నిరసన ప్రదర్శన, రాస్తారోకో నిర్వహించారు. నర్తకి సెంటర్ నుండి యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు పి. ప్రవీణ్ కుమార్ రెడ్డి ఆధ్వర్యంలో ప్రదర్శనగా వి.ఆర్.సి. సెంటర్ చేరుకొని అక్కడ రాస్తారోకో జరిపారు. అక్కడ నుంచి కోటమిట్టలోని విద్యుత్ డి.ఇ. కార్యాలయం వెళ్లి ధర్నా చేసి వినతి పత్రం సమర్పించారు. కార్యక్రమంలో కౌన్సిలర్లు రంగయ్య, ఆసియా బేగం, అరుణ కుమారి కూడా పాల్గొన్నారు.

### దర్గామిట్ట హైస్కూల్‌లో సంచయిక పథకం

దర్గామిట్టలోని డిసిటర్ జడ్పి వున్నత పాఠశాలలో చిన్న మొత్తాల పొదుపు పథకం సంచయికను ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో జిల్లా చిన్న మొత్తాల పొదుపు అధికారి కె.ఎస్. మూర్తి, ఈ విభాగం తహసిల్దార్ ఆర్. రామ సుబ్బారావు పాల్గొని పొదుపు గూర్చి విద్యార్థులకు వివరించారు. స్కూల్ పిల్లలు ఆ రోజు 2016 రూపాయలు పొదుపు చేసినట్లు ప్రధానో పాధ్యాయుడు టి. జనార్దన రెడ్డి చెప్పారు.

### కరువు మండలాలుగా ప్రకటించాలి

జిల్లా రైతు సంఘం సర్వసభ్య సమావేశం ఆచార్య పిసి రెడ్డి అధ్యక్షతన జిమ్మాగార్డన్‌లో 24 తేది జరిగింది. సకాలంలో జిల్లాలో వర్షాలు కురవక పోవడం వల్ల జిల్లాలోని మెట్ట ప్రాంతాలలో దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినట్లు సమావేశం అభిప్రాయ పడింది. దీని నివారణకు యుద్ధ ప్రాతి పదికన నిధులు మంజూరు చేస్తూ, జిల్లాలోని అన్ని మండలాలనూ కరువు పీడిత ప్రాంతాలుగా ప్రకటించాలని తీర్మానించారు. సంఘం కార్యదర్శి కె. చంద్రమోహన రెడ్డి చివరన వందన సమర్పణ చేశారు.

### పోస్టల్ కాలనీ రెసిడెంట్స్ సమావేశం

ది పోస్టల్ కాలనీ రెసిడెంట్స్ వెల్ఫేర్ అసోసియేషన్ సర్వ సభ్య సమావేశం 24 తేది పోస్టల్ కాలనీలోని విద్యానికేతన్ స్కూల్‌లో అసోసి యేషన్ అధ్యక్షుడు ఎన్. అంజ నేయులు అధ్యక్షతన జరిగింది. అసోసి యేషన్ సావత్సరిక కార్య కలాపాలను సమీక్షించిన అనంతరం, ఒంగోలు ఎమ్పీ మాగుంట సుబ్బరామ రెడ్డి అకాల మరణానికి సంతాప సూచకంగా అసోసియేషన్ కార్యదర్శి జి. రామ్మూర్తి సంతాప తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. సభ్యులందరూ సుబ్బరామ రెడ్డి ఆత్మ శాంతికి రెండు నిముషాలు మౌనం పాటించారు.

### నెల్లూరులో హైకోర్టు న్యాయమూర్తి

హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ రమేష్ మాధవ్ బాపట్ 23 తేది నెల్లూరుకు వచ్చారు. ప్రభుత్వాసుపత్రి వద్ద 70 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించ తలపెట్టిన న్యాయమూర్తుల నివాస గృహ సముదాయానికి శంకు స్థాపన చేశారు. ఈ సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. న్యాయ మూర్తు లందరూ ఒకే చోట వుంటే అన్ని కోర్టుల వ్యవహారాలు సక్రమంగా జరుగుతాయి. పట్టణం నడిబొడ్డున ఇటువంటి స్థలం దొరకడం సంతోషకరం. ఈ గృహాలను త్వరిత గతిన పూర్తి చేయించేందుకు శంకు స్థాపనకు కృషి చేసిన జిల్లా జడ్జి ఎల్. అప్పారావు వాటి సత్వర నిర్మాణానికి మరింత కృషి చేయక తప్పదన్నారు. జిల్లా జడ్జి ఎల్. అప్పారావు మాట్లాడుతూ గతంలో జిల్లా కలెక్టర్లుగా పని చేసిన రాజా, సాంబ శివ రావు, ప్రస్తుత ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్‌ల చొరవ వల్లే వసతి గృహాల స్థలం సమ కూరిందన్నారు. ఈ కార్యక్రమంలో ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్, ఎస్పీ పూర్ణ చంద్రరావు, స్థానిక న్యాయ మూర్తులు చంద్ర కుమార్, శ్యాం సుందర రావు, మహమ్మద్ గన్ పరీఫ్ బాషా, స్వర్ణలత, ప్రేమా రాజేశ్వరి పాల్గొన్నారు.

ప్రారంభోత్సవానికి బయలు దేరే ముందు రోడ్లు భవనాల శాఖ అతిథి గృహంలో విలేఖరులతో హైకోర్టు జడ్జి బాపట్ ముచ్చటించారు. వివిధ కోర్టులలో పని చేస్తున్న న్యాయ మూర్తుల బదిలీలు ఏడాది మధ్యలో చేయ కూడదన్న నిబంధన ఏదీ లేదని, అప్పటి పరిస్థితులను బట్టి బదిలీలు జరుగు తాయని చెప్పారు. చెన్నూరు కేసు తీర్పు చెప్పిన న్యాయ మూర్తి వై.వి. రామకృష్ణ బదిలీ కావడంలో ఎటువంటి రాజకీయ ప్రమేయం లేదని చెప్పారు. రెండు నెలల క్రిందట తాను నెల్లూరు జిల్లాలో పని చేసే న్యాయ మూర్తుల పైన, సిబ్బంది పైన వచ్చిన అభియోగాలను విచారించి హై కోర్టుకు నివేదిక సమర్పించానని, వాటి పై చర్యల విషయం తనకు తెలియ దన్నారు. ఎక్సైజ్ కేసులు విచారిం చేందుకు జిల్లాలో ప్రత్యేక కోర్టు ముఖ్య మంత్రి ఏర్పాటు చేస్తారన్నారు కదా, దాన్ని ఏర్పాటు చేస్తున్నారా లేదా అని ప్రశ్నించగా ఆ విషయం హై కోర్టు వరకు రాలేదని వివరించారు. కాసేపు విశ్రాంతి అనంతరం న్యాయమూర్తి గూడూరు టౌన్‌లో సబార్డినేట్ కోర్టు ప్రారంభించను వెళ్లారు.

### మద్రాసుకు నీళ్లు

4 పేజీ కొరవ

పెట్టుకొన్నట్లు చెప్పారు. ఇప్పటికే 14 కోట్లు ఖర్చు పెట్టారని, ఈ ఏడాది మార్చి చివరకు మిగతా 10 కోట్లు ఖర్చు పెట్టే విషయమై తాను, సిపిఎం శాసన సభ్యుడు జక్కా వెంకయ్య, కాంగ్రెస్ శాసన సభ్యుడు యానాది రెడ్డి శాసన సభలో ప్రభుత్వాన్ని ప్రశ్నించినట్లు సోమిరెడ్డి వివరించారు. జిల్లా రైతాంగాన్ని గూర్చి మంత్రిగా వున్నప్పుడు ఏనాడూ పట్టించుకొని మనిషి, ఇప్పుడు నిరాహార దీక్షకు కూర్చోవడ మేమిటని, పేరు ప్రస్తావించ కుండా నల్లపురెడ్డి ప్రసన్న కుమార రెడ్డిని విమర్శించారు.

ప్రజల వద్దకు పాలన కార్యక్రమం సూపర్ సక్సెస్ కావడానికి ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడే కారణ మన్నారు. విద్యుత్ సమస్య చంద్రబాబు నాయుడు కాబట్టి సరిదిద్ద గలిగాడని; వేరే ముఖ్య మంత్రి అయితే చేతు లెత్తేసే వాడని సోమిరెడ్డి బహుదా ప్రశంసించారు. కాని ఇంకా జిల్లా తెలుగు దేశం కార్యాలయం గోడ మీద హుంకరిస్తూ ప్రత్యేక ఆకర్షణగా వున్న ఎన్టీ రామారావు చిత్రపటాన్ని ఏ చంద్రబాబు వర్గం శాసన సభ్యుడూ తొలగించే సాహసం చేయలేక పోవడం లోని భావమేమి తిరుమలేశా?

### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

ముక్తసరిగా కథ ఏమిటంటే ధర్మారాయుడు (చిరంజీవి) భార్య పార్వతి (జయసుధ) గర్భంతో వుండి బాధ పడుతూ వుంటే ఆమె బాధ నివారించేందుకు ధర్మా రాయుడు ప్రయత్నిస్తున్నప్పుడు రాజకీయ నాయకుడు జె.కె. రావు (పరేష్ రావల్) ధర్మారాయుడి వీపు మీద కత్తి దిగేస్తాడు. పార్వతి కులట అని, తన భర్తను చంపిందని, హత్యానేరం ఆమె మీద మోపి జైలుకు పంపుతాడు. ధర్మారాయుడు కుమారుడు రాజా (చిరంజీవి) తన బామ్మ (మనోరమ) పెంపకంలో రిక్షావోడుగా పెరుగుతాడు. నీ తల్లి పార్వతమ్మ జైల్లో వుందని చెప్పి బామ్మ చనిపోతుంది. రాజా జైలు గోడ దూకి తన తల్లిని కలుసు కుంటాడు. ఆ తర్వాత శత్రు సంహారం చేస్తాడు.

మధ్యలో హీరో రాజా ఇద్దరు హీరోయిన్లతో (నగ్మా, సౌందర్య)తో డాన్సులు చెయ్యడం షరా మామూలుగా జరుగు తుంది.

### సినిమా

9 పేజీ కొరవ

నంది కొండల్లో తీశారు. ఈ చిత్రంలో అలీ, కోట శ్రీనివాస రావు, తనికెళ్ళ భరణి, బ్రహ్మానందం, బాబు మోహన్, అశోక్ కుమార్, శ్రీలక్ష్మి, జయలలిత, అన్నపూర్ణ, హీరో కృష్ణ సరసన బొంబాయి తార ప్రియాంక పాల్గొన్నారు. దర్శకత్వం: కొల్లి రామ్‌గోపాల్.

### "అమ్మో... అల్లుడా!"

"కొన్ని పరిస్థితుల కారణంగా తల్లి దండ్రులు వేరయ్యారు. కూతురు తండ్రి దగ్గరే పెరిగి పెద్ద దయింది. తల్లి దండ్రులను కూతురు కలపడం ఎంతో గగుర్పాటు కల్గిస్తుంది" ఊరంతా గౌరవించే మామ గారు గాడి తప్పినప్పుడు ఆయనను సక్రమ మార్గంలో పెట్టే బాధ్యత అల్లుడిదినూ! ఈ అంశాలలో కడుపుబ్బ నవ్వించే హాస్యం వుంటుంది" అన్నారు కోనేరు రవీంద్ర నాథ్. ఈయన కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం వహిస్తూ నిర్మించే "అమ్మో... అల్లుడా" చిత్రంలో రాజా రవీంద్ర, సుమిత్, లక్ష్మి రోజా, నిలిమ, బాబూ మోహన్, సుబ్బరాయ శర్మ నటిస్తున్నారు. సంగీతం: వాసూ రావు, ఛాయ: దివాకర్. సి.ఎమ్. ప్రవేశ పెట్టిన రాయితీల వల్ల చిత్ర నిర్మాణాల సంఖ్య పెరిగే అవకాశం వుంది. మంచి చిత్రాల తయారీకి ఈ రాయితీలు ఎంతో ప్రోత్సాహ న్నిస్తున్నాయి" అన్నారు దర్శక నిర్మాత కోనేరు రవీంద్ర నాథ్.

---

### రాజమండ్రి సబార్డినేటు జడ్జి కోర్టులో

S.C. 200/93

...జా వెంకటరమణ -వాది

ఎదిరి

1. ఎనమల వెంకటరత్నం (died)
2. ఎనమల లక్ష్మమ్మ భర్త వెంకట ...త్నం, హిందు, వయస్సు 41 ...వత్సరాలు, హరనాధ పురం, ...ల్లూరు, నెల్లూరు డి.ఎం.సి.
... ఎనమల వెంకటేశ్వర రావు, .../o. డిటో, హిందు, ...స్సు 19 సం. డిటో డిటో
... ఎనమల మంగమ్మ, D/o. డిటో, వయస్సు 21 సం.
... ఎ. లక్ష్మమ్మ, డిటో, డిటో

-2 to 4 ప్రతివాదులు

...వాలో పైలో 2,3,4 ఆసాములకు ...నోటీసు కోర్టు వారు పత్రికలో ...ప ఆర్డరు వేసినారు మీరు ...తేదిన ఉ. 101/2 గంటలకు ... హాజరై ఆక్షేపణలు తెలుపు ...లేని యెడల మీ పరోక్ష ...నింప బడును.

పి.వి. సుబ్బారావు
వాది అడ్వకేటు

---

**In the Court of the Subordinate Judge, Nellore**

E.P. No. 21 of 1994.
O.S. No. 114 of 1990

Andhra Bank- Decree Holder
S. Bhagya Lakshmi
- Judgement Debtor

Following property of the judgement debtor will be sold in public auction by the above court on 22.1.1996 commencing from 10.30 A.M.

Vacant site of the extent of 118 ankanams (789.302 sq. meters), being plot Nos. 16 and 17 of an approved layout comprised in S.No. 2067/13 of Nellore Bit I (Kothuru) within the sub registration area of Nellore and bound on the east by Road. South by layout Road of thirty feet wide between this site and plot No. 18 west by layout Road. North by plot No. 15.

Decree Holder's value Rs. 59,000/-
Amin's Value Rs. 45,000/-

**M.A. Sesha Reddy**
Advocate for DHR

"అంతా రెండు నిముషాల్లో జరిగి పోయింది; ఇప్పటికీ కలగానే వుంది!"

# పోలీస్‌లో ఎందుకంత నిర్లక్ష్యం?

నారాయణాద్రిలో తిరిగి హైదరాబాదు వెళ్లి పోవాలని. అందువల్ల ఆ ప్రకారం కారు. రైలులో టిక్కెట్లు ఏర్పాటు చేయమని చెప్పారు. సమయానికి సుబ్బరామ రెడ్డి గారు వాడే కారు దొరకక పోయే సరికి, పివి ప్రసన్న రెడ్డి గారి కారు తీసుకొని నేను ఒంగోలు వెళ్లాను. హైదరాబాదు ఎక్స్‌ప్రెస్‌లో ఒంగోలు వరకు, నారాయణాద్రిలో ఒంగోలు నుంచి హైదరాబాదుకు టిక్కెట్లు రిజర్వు చేశాము. అక్టోబరు 26 తేది తర్వాత ఆయన ఒంగోలుకు రావడం అప్పుడే! తెకువ ఝామున ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్ అర గంట ఆలస్యంగా వచ్చింది. నా తోటి పది మంది వరకు స్టేషన్‌కు వచ్చారు. సుబ్బరామ రెడ్డి గారిని తీసుకొని ఇంటికి వచ్చాము. అప్పటికే కొందరు ఆయన కోసం ఎదురు చూస్తుండినారు. వారితో ఆరు గంటల వరకు మాట్లాడారు. స్నానం చేసి 7 గంటల ప్రాంతంలో మార్కాపురం బయల్దేరాము. మా తోటి మాజీ ఎమ్మెల్యే బాలయ్య కూడా వచ్చారు. గన్‌మ్యాన్ మా వెంట రాలేదు. కారులో సందు లేక ఒంగోలులోనే ఆగిపోయాడు.

సుబ్బరామ రెడ్డి గారు ఒంగోలుకు వచ్చిన తర్వాత మొదట అనుకున్న కార్యక్రమం మారి పోయింది. మునిసిపల్ ఛైర్మన్ శ్రీ మంత్రి శ్రీనివాసులు పొద్దున్నే వచ్చి అప్పటి కప్పుడు కొన్ని కార్యక్రమాలు పెట్టాడు. పోలీసు కాలనీలో కొళాయిల ప్రారంభోత్సవం, ఇస్లాం పేటలో ఒక కార్యక్రమం పెట్టారు. వాటికి సుబ్బరామ రెడ్డి గారు మధ్యాహ్నం 1.30 కి సమయం కేటాయించారు. వాటిని చూసుకొని నెల్లూరు వెళ్లాలనేది ఉద్దేశ్యం. నెల్లూరులో సాయంత్రం 5 గంటలకు ఒక అంగడి ప్రారంభోత్సవం వుండింది. అందువల్ల ఆయన సింగరాయ కొండ కార్యక్రమం రద్దు చేసుకున్నారు. మార్కాపురం చేరేసరికి ఉదయం 10 గంటలైంది. 11 గంటలకు తిరిగి బయల్దేరాము. మొదట అనుకున్నట్లు కనిగిరి మీద కాకుండా, వచ్చిన దారినే - చీమకుర్తి, సంతనూతన పాడుల మీదుగా ఒంగోలు తిరిగి వచ్చేందుకు బయల్దేరాము. వున్నట్లుండి నన్ను పిల్చి, కనిగిరి వెళ్లి మాజీ ఎమ్మెల్యే మహీధర్ రెడ్డిని పిల్చుకొని రమ్మని పురమా యించారు; ఆయన, బాలయ్య, మరి ఇద్దరు కలిసి ఒకే కారులో ఒంగోలు వెళ్లి పోయారు.

## మాగుంట హత్య

(మొదటి పేజీ కొరవ)

నేను మహీధర్‌తో కలిసి ఒంగోలు వచ్చేటప్పటికి మధ్యాహ్నం 1.40 గంటలైంది. అప్పటికే సుబ్బరామ రెడ్డి గారు రెడీ అయి, బయల్దేరడానికి సిద్ధంగా వుండినారు. గది లోపల తాటిపర్తి సుబ్బారెడ్డి ఒక్కడే వుండినాడు. నేను, మహీధర్ లోపలకు వెళ్లాం. తనకు టైం అయిందని, ఎస్పి గారితో అప్పాయింట్ మెంట్‌కు అర్జంట్‌గా వెళ్ల వలసి వుందని, కాబట్టి కారులో వెళ్తూ మాట్లాడు కుందామని ఆయన గదిలో నుంచి బయటకు వచ్చారు. నేను ఒక అడుగు ముందుకు వేసి తలుపు తీసి, ముందు నిలబడ్డాను. వెనుక ఆయన వచ్చారు; ఆయన వెనుక తాటిపర్తి సుబ్బారెడ్డి, మహీధర్ రెడ్డి వున్నారు. వారు అప్పటికి గది లోపలే వున్నారు.

ఆ ఇంటిలో సుబ్బరామ రెడ్డి గారి గదికి ఎదురుగా నా గది వుంది. రెండింటి మధ్య కొద్ది ఖాళీ స్థలం; దానికి సమాంతరంగా డ్రాయింగ్ రూం వుంది. అందులో ఒక ప్రక్క సోఫాలు, ఇంకొక ప్రక్క డైనింగ్ టేబుల్ వుంటాయి. ఒక వారగా గుమాస్తా టేబుల్, టైప్ మిషన్ వున్నాయి. గది బయట, సోఫాలో, డైనింగ్ టేబులు దగ్గర, వెలుపల వరండాలో, ఆ వెలుపల ఆరు బయలులో దాదాపు వంద మంది పైగా వున్నారు. హాలు నిండా జనమే.

మేము గది నుంచి బయటకు వచ్చిన క్షణంలోనే ఒక వ్యక్తి సైకప్పుకు




గురిపెట్టి తుపాకి పేల్చి, ఫైర్... మూవ్ అని గట్టిగా అరిచాడు. హాలు లోపలున్న జనంలో ఎవరో గ్రూపు తగాదాలతో రచ్చ సృష్టిస్తున్నారని ఒక్క క్షణం అన్పించింది. ఈ లోపల సుబ్బరామ రెడ్డి గారికి ఎదురుగా నిలబడిన ఇద్దరు గబుక్కున ముందుకు దూకి తుపాకులు పేల్చారు. అవి పెద్దగా శబ్దం చేయలేదు. తుపుక్.. తుపుక్ అన్న స్వల్ప ధ్వని మాత్రమే విన్పించింది. ఏమి జరుగు తున్నదీ అర్థం కాక పోయినప్పటికీ, నేను సుబ్బరామ రెడ్డి గారికి అడ్డం పోయాను. ఒక బుల్లెట్ నాకు తగిలింది. ముందు నొప్పి తెలియ లేదు. కాని రక్తం చిమ్మిన ఫౌంటెన్ వలె చిమ్మడం కన్పించింది. భయపడి పెద్దగా కేక పెట్టి, ప్రక్కకు తిరిగి చూసే సరికే సుబ్బరామ రెడ్డి గారు మెల్లగా క్రిందకు వాలిపోతూ కన్పించారు. ఆపబోయే లోపలే ఆయన తల బెడ్ రూమ్ తలుపుకు ఆనుకొని నేలను తాకింది. తాటిపర్తి సుబ్బారెడ్డి మా వెనుకగా వస్తూ చేయి పైకి ఎత్తారు. అతడి చేతికి బుల్లెట్ తగిలింది. ఈ దారుణ మంతా రెండు నిముషాలలో జరిగి పోయింది.

నేను వెంటనే నా గదిలోకి పరుగెత్తి, ఎస్పి గారికి టెలిఫోన్ చేయడానికి ప్రయత్నించాను. నాకు శక్తి చాలలేదు. ప్రక్కనున్న ఎవరో ఎస్పి ఆఫీసుకు ఫోన్ చేసి వార్త అందించారు.

నేను మళ్లీ గది నుంచి బయటకు వచ్చాను. అప్పటికి హాలు ఖాళీ అయి పోయింది. తలా ఒక దిక్కుకు పరుగెత్తారు. హంతకులూ వెళ్లి పోయారు. ఈ దారుణం జరిగే టప్పుడు సుబ్బరామ రెడ్డి గారి గదిలో కాని, హాలులో కాని గన్‌మ్యాన్ లేడు. బహుశా బయట వుండి వుంటాడు. నక్సలైట్లు చెప్తున్నట్లు గన్‌మ్యాన్ అడ్డం రావడం, వారి పై కాల్పులు జరపడం ఆ గది దగ్గర చేయలేదు. గణేశ్‌కు తగిలిన బుల్లెట్ కూడా హంతకులలో ఒకడి తుపాకికి సంబంధించినదే అయి వుండాలి. గన్‌మ్యాన్‌ది మాత్రం కాదు.

ఆ హంతకుల నెవరినీ నేను ఇది వరకు చూడలేదు; అదే ప్రథమం. వారు గదిలోకి రావడం, సుబ్బరామ రెడ్డి గారితో మాట్లాడడం నిజమని నేను అనుకోవడం లేదు. మార్కాపురం నుంచి నా కంటే ముందుగా వచ్చినప్పటికీ, ఆ అరగంట వ్యవధిలో కొత్త వారి నెవరినీ కలిసి మాట్లాడినట్లు లేదు. హంతకులు హాలులోని జనంలో కలిసి పోయి వుండి, ఆయన గది నుంచి బయటకు రాగానే కాల్చారని భావించాలి. తర్వాత నేను విచారిస్తే తెలిసిన దాని ప్రకారం - బయటి గేటుకు ఎదురుగా ఒక కారు వుండిందని, అందులో డ్రైవరు సీటులో ఒక వ్యక్తి, కారుకు ఆనుకొని నిలబడి ఒక వ్యక్తి వుండినారని. లోపల నుంచి ముగ్గురు నడిచి రావడం ప్రక్క ఇంటి మిద్దె మీద నిలబడి వుండిన వారు చూశారని తెలుస్తూంది. కారు దగ్గర నిలబడి వున్న వాడి చేతిలో ఆటోమాటిక్ తుపాకి వున్నట్లు ప్రక్క ఇంటి వారు చూశారు.

గన్‌మ్యాన్ గదిలో కాని, గది బయట వాకిట్లో కాని లేడనేది నాకు బాగా తెలుసు. అతడు ఆరు బయలులో వుండి, గలభా విని లోపలకు రాబోయే టప్పుడు కాల్చి పారేసి నట్లున్నారు. అతడు లోపలకు వచ్చేటప్పటికే సుబ్బరామ రెడ్డి గారు క్రింద పడిపోయి వున్నారు.

నాకు తెలిసి నంత వరకు గన్‌మ్యాన్ తన రివాల్వర్‌ను ఎప్పుడూ ఒక చేతి గుడ్డలో చుట్టుకొని వుండేవాడు.

అది జేబులో వున్నప్పుడు పొరపాటున ప్రేలి ప్రమాదం జరగ కుండా, మ్యాగజైన్‌లో తొలి బుల్లెట్‌కు దారం చుట్టి పెట్టి వుండే వాడు. అందువల్లే ఆ రోజు అతడు తుపాకి పేల్చినప్పుడు ఆ బుల్లెట్ బయటకు రాకుండా - లోపలే వుండి పోయిందని భావించాలి. సాధారణంగా గన్‌మ్యాన్ సుబ్బరామ రెడ్డి గారు తన గదిలో వున్నప్పుడు వాకిట్లో నిలబడి వచ్చి పోయే వారిని కంట్రోలు చేస్తుండే వాడు. తలుపు వేయడం, తీయడం అతడే చేసే వాడు. కాని ఆ రోజు ఎందువల్లో ఆ సమీపంలో లేడు. అతడు అక్కడే వుండి వుంటే పరిస్థితి ఏ రకంగా వుండేదో వూహించలేము. అంతకు క్రితం ఎస్పి గారు ఫోన్ చేసి, సుబ్బరామ రెడ్డి గారితో మాట్లాడ డానికి తాను ఆ సమయంలో అక్కడికి వస్తానని, పోలీసు కాలనీ సభకు ఇద్దరం కలసి వెళ్దామని చెప్పారట. కాని సుబ్బరామ రెడ్డి గారు ఆయనతో మీరు రావద్దు, నేనే వస్తాను, మీ ఆఫీసులో వెయిట్ చేయండి అని చెప్పారట. అనుకున్న ప్రకారం ఎస్పి గారు అక్కడకు వచ్చి వుండినా ఈ ఘోరం జరిగి వుండేది కాదు.

హంతకులు వాడిన రివాల్వర్లకు సైలెన్సర్ వుందో లేదు నాకు తెలియదు కాని, వారు పేల్చినప్పుడు సాధారణ తుపాకుల వలె శబ్దం రాలేదన్నది నిజం. గది లోపల మాత్రం ఆటోమేటిక్ తుపాకులు వాడలేదు.

కొరవ 7 పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, N